# విష్ణు సూక్తము

( ఋగ్వేదమందలి ఋక్కుల భావార్థ వివరణము )

వివరణము :

కులపతి ఎక్కిరాల కృష్ణమాచార్య



ది వరల్డ్ టీచర్ ట్రస్ట్ ప్రచురణ
విశాఖపట్నం - 530 002.

ప్రథమ ముద్రణము 1981

ద్వితీయ ముద్రణము 1994



వెల : రూ॥ 10-00

ప్రాప్తిస్థానము :

డైరెక్టర్ ఆఫ్ పబ్లికేషన్స్
ది వరల్డ్ టీచర్ ట్రస్ట్
14-38-2, రాధామాధవమ్,
ముప్పిడి కాలనీ, విశాఖపట్టణము-530 002.



ముద్రణ :

ఎక్వేరియన్ ప్రింటింగ్ స్కూల్,
విశాఖపట్నం-530 016. ఫోను : 547320

# పీఠిక

మానవ జాతికి మొట్ట మొదటి గ్రంథము ఋగ్వేదమని ప్రాచీన భారతీయులును, నవీన పాశ్చాత్యులును గ్రహించి తమ గ్రంథముల యందు ముక్త కంఠముగా నిశ్చయించి పలికిరి. ఇప్పటి ఋగ్వేదము ఆ ప్రాచీన వేద గ్రంథమున కొంత భాగము. ఇందు కొన్ని సూక్తములు పరిపూర్ణములు, కొన్ని ఖిలములు. పరిపూర్ణములగు సూక్తములలో వివరింప బడిన విషయము స్వయం సంపూర్ణముగ నుండును. అట్టి వానిలో ముఖ్యమయినవి పురుష సూక్తము, శ్రీ సూక్తము, సుపర్ణ సూక్తము, అశ్వినుల సూక్తములు, ఇంద్రుని సూక్తములు, అగ్ని సూక్తములు, విష్ణు సూక్తములు. ఇందలి విష్ణు సూక్తములు అర్థ గంభీరములు. దర్శన జ్ఞాన ప్రధానములు. అనమాన కవితా కల్పనా సంపన్నములు. ఇందలి కవితా కల్పనము కవి కల్పనము గాక సృష్టి కల్పనముగా భాసించుటయే ఈ సూక్తముల అనన్యత.

కవిత్వము రెండు విధములు. ఒకటి కవి ప్రతిభకు గోచరించిన దానిని వాగర్థములలో నలంకరించుట. రెండవది సృష్టి కల్పనము యొక్క సౌందర్యమును అర్థముగా వాక్కులలో పొదుగుట. మొదటి మార్గము నవలంబించినవారు లౌకికులగు మహాకవులు. వారి రచనలలో ఎంత గొప్పదన

మున్నను 'నన్ను చూడు, నా అందము చూడు' అన్నట్లుగా నుండును. దీనినే 'గమిష్యామి అపహాస్యతాం' అని కాళిదాసు సున్నితముగ మందలించెను. ఇక రెండవ మార్గము నవలంబించిన కవులు మొదటి తరగతికి చెందినవారు. వారి రచనలే వేదములు. అవి 'వారి రచనలు' కావు గనుక అపౌరుషేయములు. అందలి శబ్దములు అంతర్యామి నుండి బయలుదేరి వారి కంఠములను వరించి వెలువడెను. అందలి అర్థములు సృష్టి యందలి అర్థములే. అయినచో మరల వ్రాయ నేల? అని అడుగవచ్చును. సృష్టి అర్థములోని కూర్పును, సౌందర్యమును గమనింప లేనివారికి వెన్ను తట్టి గమనింప జేయుటయే ఇందలి ప్రయోజనము. తాను కోరిన సంగీతము రేడియో నుండి వినబడు చుండగా, దాని గొప్పదనమును గూర్చి ప్రసంగించు కొనుచు వినుట మానిన బుద్ధిమంతుల వంటి వారికి హెచ్చరిక చేసి, మౌనముతో వినుమని సంజ్ఞ చేయుటకు ప్రక్కన కొంద రుండవలెను. అట్టి వారే వేద ఋషులు. వారి రచనలే యీ సూక్తములు.

సృష్టి యంతయు సామాన్యునకు అభ్రకపు రేకులవలె లోకములు లోకములుగా నేర్పడుచున్నది. ఒక లోకమున ప్రజ్ఞ నిరికించి జీవించువానికి మరియొక లోకముతో సంబంధ ముండదు. ఎవరి లోకము వారిదే. అదే గుడ్డి మా లోకము. నిద్రించుచున్న వాని పొట్టపై తేలు ప్రాకుచుండగా వారిరువురికిని సంబంధము లేదు. ఇట్టిదే రెండు లోకములలో వేరు

వేరుగా జీవించుచు సహచరులై బ్రతుకుచున్న వారి ప్రజ్ఞ కూడ. ఆ ఇద్దరును తండ్రి-బిడ్డ అయినను, తల్లి-బిడ్డ అయినను, భార్య-భర్త అయినను, భౌతికముగా వ్యవహారము జరుగునే కాని, ఒకరి కొకరు జీవింపరు. ఇట్టి సంసార మగ్నమైన అంధ జీవిత వ్యాధికి నివారణోపాయము అంతర్యామి ప్రజ్ఞయొక్కటే! దాని నుపాసించుటయే విష్ణూపాసనముగా మొట్టమొదట ఋగ్వేదమున కనుపించును. దానిని ప్రతిపాదించు తేజోమయములైన వాక్యములే విష్ణు సూక్తములు. వీనిని శ్రద్ధతో చదివినను, విన్నను, వివరించి యర్థము చెప్పినను, అంతర్యామి ప్రజ్ఞ శ్రద్ధ ననుసరించి సిద్ధించును. అట్టి ప్రయత్నమే ఈ విష్ణు సూక్తముల వివరణము.

ఇందలి విష్ణు సూక్తములలో ఈ దిగువ సత్యములు ప్రతిపాదించ బడినవి.

1. విష్ణువనగా అన్ని లోకముల యందును అంతర్యామిగ నున్న వెలుగు.

2. దీనికి మూడు పాదములున్నవి. ఒకటి స్థూల దృష్టి. రెండవది సూక్ష్మ ప్రజ్ఞ యనబడు వెలుగు. మూడవది ఈ రెండింటి యందున్న అంతర్యామి. ఇందు మొదటి రెండును సామాన్య మానవుల కంతుపట్టును. మూడవది విష్ణున కొక్కనికే అంతుపట్టును. అనగా మానవుడు మానవుడుగా అర్థము చేసికొనుట కంతుపట్టదు. విషువునందు తాను సమర్పణము కాగా తానును విష్ణువైనందువలన అంతుపట్టును.

3. అంతర్యామి ప్రజ్ఞయే విష్ణువు. జీవ ప్రజ్ఞయే ఇంద్రుడు. ఇద్దరును వృక్షము పుష్పమువలె సృష్టి కర్మను నిర్వహించుచు ఇంద్రావిష్ణువు లనబడుదురు.

4. భౌతిక మానవ దేహమున వామనుడుగా విష్ణువు పుట్టును. అతడు ఇంద్రుని సంపదను యాచించుటతో ప్రారంభించి రెండు పాదములతో భూమ్యాకాశము ల నడుమ నున్న దానిని కొలచును. మూడవడయైన పరమపదముతో త్రివిక్రముడై అంతర్యామిత్వము నొందును.

5. విష్ణువు తన్ను దానము చేసి సృష్టియం దంతర్యామి యగుచున్నాడు. జీవుని యహంకారము తనకున్న దానిని దానముచేసి బలిచక్రవర్తి యగుచున్నది. దానిని విష్ణువు తన మూడవ పదముతో ఆక్రమించి తన స్థితిలోనికి స్వీకరించు చున్నాడు. ఇంద్రుడు తన సామ్రాజ్యమైన జీవప్రజ్ఞను స్వర్గముగా పొందుచు, పోగొట్టుకొనుచు, ఇంద్రుడుగనే మిగిలిపోవు చున్నాడు.

6. ఈ సృష్టియందు సర్వము విష్ణువే అయివుండగా-ఇతర వస్తువులు, సంబంధములు, కష్టసుఖములు, ధర్మాధర్మములును-లేనివి ఉన్నట్లు కనుపించునట్లు చేయు శక్తి యొకటి యున్నది. అదియే శాంబరి యనబడు మాయ. దాని కధిపతి శంబరాసురు డనబడు అజ్ఞానము.

7. నవద్వారములతో దేహములు కోటలుగా అల్లిన శంబరాసురుడు 9 సంఖ్యచే తెలియబడు చున్నాడు. ఇంద్రుడు "నేను" అనబడు 1 సంఖ్యచే తెలియబడు చున్నాడు. అతడు విష్ణుప్రజ్ఞయగు పూర్ణత్వము నుండి ('O' నుండి) ఉద్భవించు చున్నాడు. అతడు యుద్ధమున శంబరుని తాకుటవలన శంబరుని కోటలు మాయమై ఇంద్రావిష్ణువులు మిగులుచున్నారు. ఈ చిత్రము $9 + 1 = 10$ అను సత్యమున దర్శన మిచ్చును.

8. ఇంద్రుడు విష్ణుని ధ్యానించుట యోగవిద్య అనబడును. దీనివలన ఇంద్రునకు శంబరాసుర వధ సాధ్యమై జీవులు పరమ పదమును అనుభవించు చున్నారు.

ఈ విధమైన కావ్య వస్తు సంపదతో పరిపూర్ణములైన విష్ణు సూక్తములు ఇందు వివరింపబడినవి. వీనిని శ్రద్ధతో అధ్యయనము చేయువారికి సామర్థ్యము, దర్శన జ్ఞానము, సంపద, ఆరోగ్యము, మోక్షప్రాప్తి కలుగును. ఇంతకు పూర్వము వ్యాఖ్యానింపబడిన పురుష సూక్తము – జీవుడను పురుషుని యందు దర్శనమిచ్చుచున్న పరమ పురుషుని దర్శింపజేయు పురుషోత్తమ ప్రాప్తియోగము. అటుపైన వ్యాఖ్యానింప బడిన శ్రీ సూక్తము నామరూప గుణాత్మకమైన ప్రకృతిలోని అంతర్యామియైన పరా ప్రకృతిని జగన్మాతగా స్థాపించుచున్నది. అటుపైన వ్యాఖ్యానింప బడిన రుద్ర సూక్తము ఈ దృశ్య ప్రపంచమందలి సమస్త రూపములను అంతర్యామి రూపము

లుగా స్థాపించు చున్నది. తరువాత వ్యాఖ్యానింపబడిన సరస్వతీ సూక్తము ఈ సృష్టి సమస్తమును సృష్టికర్తయొక్క ఉచ్చారణ రూపమైన వాక్ప్రవాహముగా దర్శింప జేయు చున్నది. ఇన్నిటి యందలి అంతర్యామిని ఈ విష్ణు సూక్తము స్థాపించు చున్నది.

ఋగ్వేద గర్భితములైన రహస్యార్థములు సూక్ష్మములే గాని క్లిష్టములు కావని నిరూపించుచు, పామరులలోని అంత ర్యామికి సమర్పితముగా ఈ ప్రయత్నము చేయబడినది.

విశాఖపట్టణము
18-11-1981

ఇట్లు
ఎక్కిరాల కృష్ణమాచార్య

# విష్ణు సూక్తములు - ౧

[ ఋగ్వేదము : మం _ 7; సూ _ 99; ఛందస్సు - త్రిష్టుప్;
ఋషి : మైత్రావరుణుడగు వశిష్ఠుడు ]

పరో మాత్రయా తన్వా వృధాన
నతే మహిత్వ మన్వశ్నువంతి ।
ఉభేతే విద్మ రజసీ పృథివ్యా
విష్ణో దేవ త్వం పరమస్య విత్సే ॥ 1.

నతే విష్ణో జాయమానో న జాతో
దేవ మహిమ్నః పరమంతమాప ।
ఉదస్తభ్నా నాకమృష్వం బృహంతం
దాధర్థ ప్రాచీం కకుభం పృథివ్యాః ॥ 2.

ఇరావతీ ధేనుమతీ హి భూతం

సూయవసినీ మనుషే దశస్యా ।

వ్యస్తభ్నా రోదసీ విష్ణవే తే

దాధర్థ పృథివీ మభితో మయూఖైః ॥ 3.

ఉరు యజ్ఞాయ చక్రథురు లోకం

జనయంతా సూర్య ముషాస మగ్నిమ్ ।

దాసస్య చిద్ వృషశిప్రస్య మాయా

జఘ్నథుర్నరా పృతనాజ్యేషు ॥ 4.

ఇంద్రా విష్ణూ దృంహితాః శంబరస్య
నవ పురో నవతిం చ శ్నథిష్టమ్ ।
శతం వర్చినస్సహస్రం చ సాకం
హథో అప్రత్యసురస్య వీరాన్ ॥ 5.

ఇయం మనీషా బృహతీ బృహంతో
రుక్రమా తవసా వర్ధయంతీ ।
రరే వాం స్తోమం విదథేషు విష్ణో
పిన్వతమిషో వృజనేష్వింద్ర ॥ 6.

వషట్ తే విష్ణవాస ఆకృణోమి
తన్మే జుషస్వ శిపివిష్ట హవ్యమ్ ।
వర్ధంతు త్వా సుష్టుతయో గిరో మే
యూయం పాత స్వస్తిభి స్సదా నః ॥ 7.

## విష్ణుసూక్తములు - ౨

[ ఋగ్వేదము : మం - 1; సూ - 155; ఛందస్సు - జగతీ
ఋషి - దీర్ఘతమసుడగు ఔచథ్యుడు ]

ప్రవః పాంతమంధసో ధియాయతే
మహే శూరాయ విష్ణవే చార్చత ।
యా సానుని పర్వతానామదాభ్యా
మహస్తస్థతు రర్వతేవ సాధునా ॥ 1.

త్వేషమిత్థా సమరణం శిమీవతో-
రింద్రావిష్ణూ సుతపా వామురుష్యతి ।
యా మర్త్యాయ ప్రతిధీయమానమిత్
కృశానో రస్తు రసనా మురుష్యథః ॥ 2.

తా ఈం వర్ధంతి మహ్యస్య పౌంస్యం
ని మాతరా నయతి రేతసే భుజే ।
దధాతి పుత్రోఽవరం పరం పితు-
ర్నామ తృతీయ మధి రోచనే దివః ॥ 3.

త త్తదిదస్య పౌంస్యం గృణీమసీ

నస్య త్రాతు రవృకస్య మీఢుషః ।

యః పార్థివాని త్రిభిరి ద్విగామభి

రురు క్రమిష్టోరుగాయాయ జీవసే ॥ 4.

ద్వే ఇదస్య క్రమణే స్వర్దృశో

అభిఖ్యాయ మర్త్యో భురణ్యతి ।

తృతీయ మస్య నకిరా దధర్షతి

పయశ్చ న పతయంతః పతత్రిణః ॥ 5.

చతుర్భిస్సాకం నవతిం చ నామభిః
చక్రం న వృత్తం వ్యతీం రవీవిపత్ ।
బృహచ్ఛరీరో విమిమాన ఋక్వభిః
యువా కుమారః ప్రత్యేత్యాహవమ్ ॥ 6.

## విష్ణు సూక్తములు – 3

[ ఋగ్వేదము . మం – 1; సూ – 22 (ఋక్ – 16 నుండి)
ఛందస్సు - గాయత్రీ; ఋషి – కాణ్వుడైన మేధాతిథి ]

అతో దేవా అవంతు నో
యతో విష్ణుర్విచక్రమే ।
పృథివ్యాః సప్త ధామభిః ॥ 16.

ఇదం విష్ణు ర్వి చక్రమే
త్రేధా ని దధే పదమ్ ।
సమూళ్హమస్య పాంసురే ॥ 17

త్రీణి పదా వి చక్రమే
విష్ణుర్గోపా అదాభ్యః ।
అతో ధర్మాణి ధారయన్ ॥ 18

విష్ణోః కర్మాణి పశ్యత
యతో వ్రతాని వస్పశే ।
ఇంద్రస్య యుజ్యస్సఖా ॥ 19.

తద్విష్ణోః పరమం పదం
సదా పశ్యన్తి సూరయః ।
దివీవ చక్షురాతతమ్ ॥ 20

తద్విప్రాసో విపణ్యవో
జాగృవాంస స్సమింధతే ।
విష్ణోర్య త్పరమం పదమ్ ॥ 21

## వి ష్ణు సూ క్త ము లు _ ४

[ ఋగ్వేదము : మం _ 7; సూ _ 100; ఛందస్సు . త్రిష్టుప్
ఋషి : మైత్రావరుణుడగు వశిష్టుడు ]

నూ మర్తోదయతే సనిష్యన్
యో విష్ణవ ఉరుగాయాయ దాశత్ ।

2)

ప్ర యస్సత్రాచా మనసా యజాత
ఏతావన్తం నర్యమావివాసాత్ ॥ 1

త్వం విష్ణో సుమతిం విశ్వజన్యా
మప్రయుతామేవయావో మతిం దాః ।
పర్చో యథా న స్సువితస్య భూరే
రశ్వావతః పురుశ్చన్ద్రస్య రాయః ॥ 2

త్రిర్దేవః పృథివీమేష ఏతాం
విచక్రమే శతర్చసం మహిత్వా ।
ప్ర విష్ణురస్తు తవసస్తవీయాన్
త్వేషం హ్యస్య స్థవిరస్య నామ ॥ 3

వి చక్రమే పృథివీమేష ఏతాం
క్షేత్రాయ విష్ణు ర్మనుషే దశస్యన్ ।
ధ్రువాసో అస్య కీరయో జనాస
ఉరుక్షితిం సుజనిమా చకార ॥ 4

ప్ర తత్తే అద్య శిపివిష్ట నామా
ఽర్యః శంసామి వయునాని విద్వాన్ ।
తం త్వా గృణామి తవస మతవ్యాన్
క్షయంతమస్య రజసః పరాకే ॥ 5

కిమిత్ తే విష్ణో పరిచక్ష్యం భూత్
ప్రయ ద్యవక్షే శిపివిష్టో అస్మి ।
మా వర్పో అస్మదప గూహ ఏత
ద్యదన్యరూపః సమిథే బభూథ ॥ 6

వషట్ తే విష్ణవాస ఆ కృణోమి
తన్మే జుషస్వ శిపివిష్ట హవ్యమ్ ।
వర్ధంతు త్వా సుష్టుతయో గిరో మే
యూయం పాత స్వస్తిభిస్సదా నః ॥ 7

# విష్ణు సూక్తములు – ౨

[ఋగ్వేదము : మం – 1; సూ – 154; ఛందస్సు – త్రిష్టుప్;
ఋషి – దీర్ఘతమనుడగు ఔచథ్యుడు]

విష్ణోర్ను కం వీర్యాణి ప్రవోచం
యః పార్థివాని విమమే రజాంసి ।
యో అస్కభాయదుత్తరం సధస్థం
విచక్రమాణ స్త్రేధోరుగాయః ॥ 1

ప్ర తద్విష్ణుః స్తవతే వీర్యేణ
మృగో న భీమః కుచరో గిరిష్ఠాః ।
యస్యోరుషు త్రిషు విక్రమణే
ష్వధిక్షియంతి భువనాని విశ్వా ॥ 2

ప్ర విష్ణవే శూషమేతు మన్మ
గిరిక్షిత ఉరుగాయాయ వృష్ణే ।
య ఇదం దీర్ఘం ప్రయతం సధస్థ
మేకో విమమే త్రిభిరిత్ పదేభిః ॥ 3

యస్య త్రీ పూర్ణా మధునా పదా
వ్యక్షీయమాణా స్వధయా మదంతి ।
య ఉ త్రిధాతు పృథివీముత ద్యా
మేకో దాధార భువనాని విశ్వా ॥ 4

తదస్య ప్రియమభి పాథో అశ్యాం
నరో యత్ర దేవయవో మదంతి ।
ఉరుక్రమస్య స హి బంధురిత్థా
విష్ణోః పదే పరమే మధ్వ ఉత్సః ॥ 5

తా వాం వాస్తూన్యుశ్మసి గమధ్యై
యత్ర గావో భూరిశృంగా అయాసః
అత్రాహ తదురుగాయస్య వృష్ణః
పరమం పదమవభాతి భూరి ॥ 6

# విష్ణు సూక్తములు – ౩

[ ఋగ్వేదము : మం – 1; సూ – 156; ఛందస్సు – జగతీ
ఋషి–దీర్ఘతమసుడగు ఔచథ్యుడు ]

భవా మిత్రో న శేవ్యో ఘృతాసుతి
ర్విభూతద్యుమ్న ఏవయా ఉ సప్రథాః ।
అథా తే విష్ణో విదుషా చిదర్ధ్యః
స్తోమో యజ్ఞశ్చ రాధ్యో హవిష్మతా ॥ 1

యః పూర్వ్యాయ వేధసే నవీయసే
సుమజ్జానయే విష్ణవే దదాశతి ।
యో జాతమస్య మహతో మహి బ్రవత్
సేదు శ్రవోభిర్యుజ్యం చిదభ్యసత్ ॥ 2

తము స్తోతారః పూర్వ్యం యథావిద

ఋతస్య గర్భం జనుషా పిపర్తన ।

ఆన్య జానంతో నామచి ద్వివక్తన

మహాస్తే విష్ణో సుమతిం భజామహే ॥ 3

తమస్య రాజా వరుణ స్తమశ్వినా

క్రతుం నచంత మారుతస్య వేధసః ।

దాధార దక్షము త్తమ మహర్విదం

వ్రజంచ విష్ణుః స ఖివా అపోర్ణుతే ॥ 4

ఆయో వివాయ సచథాయ దైవ్య

ఇంద్రాయ విష్ణుః సుకృతే సుకృత్తరః ।

వేధా అజిన్వత్ త్రిషధస్థ ఆర్య

మృతస్య భాగే యజమాన మాభజత్ ॥ 5

## విష్ణు సూక్తములు – ౭

( ఋగ్వేదము. ఖిలకాండము. సూక్తము 20 - ఛందస్సు : అనుష్టుప్ )

యత్ర తత్పరమం పదం

విష్ణోర్లోకే మహీయతే ।

దేవైః సుకృత కర్మభి

తత్ర మా మమృతం కృధి ।

ఇంద్రా యేందో పరిస్రవ ॥ 1

యత్ర తత్ పరమావ్యం

భూతానా మధి పతిః ।

భావ భావీచ యోగీశ్చ

తత్ర మామమృతం కృధి ॥

ఇంద్రాయేందో పరిస్రవ ॥ 2

యత్ర లోకా స్తనూత్యజః

శ్రద్ధయా తపసా జితాః ।

తేజశ్చ యత్ర బ్రహ్మచ

తత్ర మామమృతం కృధి ॥

ఇంద్రాయేందో పరిస్రవ ॥ 3

యత్ర దేవా మహాత్మానః
సేంద్రాశ్చ సమరుద్గణాః ।
బ్రహ్మ చ యత్ర విష్ణుశ్చ
తత్ర మామభయం కృధి ॥
ఇంద్రాయేందో పరిస్రవ ॥ 4

యత్ర గంగాచ యమునా చ
యత్రప్రాచీ సరస్వతీ ।
యత్ర సోమేశ్వరో దేవ
స్తత్ర మా మమృతం కృధి ॥
ఇంద్రాయేందో పరిస్రవ ॥ 5

యత్ర తద్విష్ణుర్మ హీయతే

నారాయణ మధిపతిమ్ ।

యత్ర శంఖచక్ర గదా

ధర స్మరణం ముక్తిశ్చ

తత్ర మా మమృతం కృధి ॥

ఇంద్రాయేందో పరిస్రవ ॥ 6

ఓం నమో నారాయణాయ ।

ఓం నమో భగవతే వాసుదేవాయ ।

ఓం విష్ణవే నమః ।

హరిః ఓం ॥



చతుర్భిస్సాకం నవతిం చ నామభిః
చక్రం న వృత్తం వ్యతీం రవీవిపత్ ।
బృహచ్ఛరీరో విమిమాన ఋక్వభిః
యువా కుమారః ప్రత్యేత్యాహవమ్ ॥

# సూక్తముల వివరణము

## విష్ణు సూక్తములు — ౧

[ ఋగ్వేదము : మం — 7; సూ — 99; ఛందస్సు — త్రిష్టుప్;
ఋషి : మైత్రావరుణుడగు వశిష్ఠుడు ]

పరో మాత్రయా తన్వా వృధాన
నతే మహిత్వ మన్వశ్నువంతి।
ఉభేతే విద్మ రజసీ పృథివ్యా
విష్ణో దేవ త్వం పరమస్య విత్సే॥ 1.

టీక : మాత్రయా = పరిమాణము చేత; పరః = మించినవాడవై; తన్వా = శరీరముచేత; వృధాన = పెరిగితివి; తే = నీ యొక్క; మహిత్వమ్ = విస్తారతను; న + అను + అశ్నువంతి = అనుభవము పొందలేదు. తే = నీ యొక్క; ఉభే = రెండిటినే ( రెండు లోకములనే ); విద్మ = తెలుసుకొన గలుగుదుము; రజసి = రజస్సుల యొక్కయు; పృథివ్యా = పృథివి యొక్కయు; విష్ణో = ఓ విష్ణూ; దేవ = ఓ దేవా; అస్య = దీనికి; పరం = పైన; త్వంవిత్సే = నీవే ఎరుగుదువు.

తాత్పర్యము : ఓ విష్ణు దేవా ! నీవు శరీర పరిమాణపు కొలతల కతీతుడవై వ్యాపించి వర్ధిల్లితివి. నీ మహిమను మరియొక రెవ్వరు అనుభవమునకు తెచ్చుకొన గలరు ? నీ మూడడుగులలో మేము రెండింటినే ఎరుగుదుము. అందొకటి పృథివి. రెండవది రజస్సుల లోకము. మూడవది యగు నీ పరమ పదమును నీ వొక్కడివే ఎరుగుదువు.

వివరణము : విష్ణువు అనగా సర్వవ్యాపి. స్థితికారకుడు అగు నంతర్యామి. అతడు ఈ సృష్టిని భూర్భువస్సువర్లోకము లనబడు మూడు లోకములుగా నిర్మించి మూడు పాదములుగా ఆక్రమించెను. అవి వరుసగా ద్రవ్యమయము, శక్తిమయము, తేజోమయము అనబడు లోకములు. అందు మొదటిది భౌతిక సృష్టి. రెండవది భౌతికమును కదలించు శక్తుల సృష్టి. అది అణుమయ, పరమాణుమయములైన శక్తులతో నేర్పడినది. మూడవది కేవలము ప్రజ్ఞామయము. మానవులు మొదటి రెండు లోకములను అర్థము చేసికొనగలరు. అర్థము చేసికొను మనస్సు మూడవ లోకములో కొంచెము భాగమే కనుక ఈ మూడవదియగు నారాయణ లోకమును ఎవ్వరును అర్థము చేసికొని ఇదమిత్థమని చెప్పలేరు. తానే సర్వము గనుక ఆ లోకము తనకు మాత్రమే తెలియును.

ఈ అంశమునే వామనమూర్తి పొట్టివాడై మూడడుగులు యాచించుట, రెండడుగులతో భూమిని, ఆకాశమును కొలుచుట, మూడవ పాదము బలిచక్రవర్తి శిరస్సుపై నుంచి అతనికి శాశ్వత లోకము నిచ్చి భవిష్యత్ బ్రహ్మగా అనుగ్రహించుట అను వామనావతార కథగా వర్ణించిరి. విష్ణుని మూడవ పాదము నుపాసించుట వలన బలి అనబడు అహంకారము భక్తుడై బ్రహ్మజ్ఞానము పొందునని దీని అరము.

నతే విష్ణో జాయమానో న జాతో
దేవ మహిమ్నః పరమంతమాప ।
ఉదస్తభ్నా నాకమృష్వం బృహంతం
దాధర్థ ప్రాచీం కకుభం పృథివ్యాః ॥ 2.

టీక : విష్ణో = ఓ విష్ణుదేవా: జాయమానః = పుట్టుచున్నవాడు; జాతః = పుట్టినవాడు; తే మహిమ్నః = నీ మహిమయొక్క: పరం + అంతం = పరమైన పారమును; న ఆప = పొందలేదు; దేవ = ఓ దేవా; ఉత్ + అస్తభ్నా = మీదికి స్తంభింప జేయుటచేత; నాకమ్ = స్వర్గమును; ఋష్వమ్ = కాంతిమంతమై దర్శనీయమైన దానిని: బృహంతమ్ = విస్తారమైన దానినిగా; పృథివ్యాః = ఈ పృథివికి; ప్రాచీం కకుభమ్ = తూర్పు దిక్కును; దాధర్థ = ధరించి ఉంటివి గదా :

తాత్పర్యము : ఓ విష్ణుదేవా! ఇంతవరకు పుట్టినవాడుగాని, పుట్టబోవు వాడుగాని, నీ పరమపదము యొక్క పారమును తన మహిమచే పొందలేదు. అతి విస్తారమై వెలుగులచే దర్శనీయమైన దివ మనబడు లోకమును పైకెత్తి పట్టి మిగిలిన లోకములను పరిపాలించు చున్నావు. ఆ నీ వెలుగుల లోకమును మా భూమికి తూర్పు దిక్కుగా నేర్పరచితివి.

వివరణము : నాకము అనగా దుఃఖములేని లోకము లేక స్వర్గము. స్వర్గము అనగా సు + వర్గము లేక మంచి ప్రవర్తనముల, సత్కర్మల సోపాన క్రమము. అది విష్ణువుయొక్క అంతర్యామి ప్రజ్ఞ. సత్కర్మలచేతను, జీవులలో అంతర్యామిని చూచుట చేతను, జీవులు విష్ణులోకమును పొందుచున్నారు.

తూర్పుదిక్కు భూమిపై నున్న వారందరికిని సూర్యోదయమును

కలిగించును. చీకటుల నుండి వెలుగుల లోనికి గొనివచ్చును. నిద్ర నుండి మెలకువ కలిగించును. ఇంద్రియములు, మనసు యొక్క అనుభవము నుండి అంతర్యామి అనుభవమును ప్రజ్ఞకు కలిగించును. కనుకనే పెద్దలు సూర్యోపాసనము, సంధ్యావందనము చేయుదురు. సూర్యోదయము నుండి ప్రారంభమగు పగలు దివ మనబడు లోకము. జీవికి వెలుపలి పగలు, లోపల ప్రజ్ఞలో దివమను లోకము, పరస్పరాశ్రయములుగా నుండును. సూర్యుని నుండి భూమికి సూటిగా దిగివచ్చు కిరణములు మనలను స్పృశించు కాలమే సూర్యోదయము. దాని వలన ఇంద్రియాధిపతియగు ఇంద్రుని ప్రజ్ఞ మనలో మేల్కొనును. కనుకనే ఇంద్రుడు తూర్పు దిక్కున కధిపతి. సృష్టియందు అంతర్యామి ప్రజ్ఞయే విష్ణు లోకము. ఇంద్రా విష్ణువులు సృష్టియను గురమునకు రెండు కళ్ళెముల వంటివారు.

భూమిపై జీవులకు సూర్యుడే సృష్టికర్త, స్థితికర్త గనుక విష్ణువు ఒక స్తంభము నెత్తిపట్టి ఉంచినట్లుగా మనకును సూర్యునకును నడుమగల మార్గ మున్నది.

ఇరావతీ ధేనుమతీ హి భూతం
సూయవసినీ మనుషే దశస్యా ।
వ్యస్తభ్నా రోదసీ విష్ణవే తే
దాధర్థ పృథివీ మభితో మయూఖైః ॥ 3.

టీక : ఇరావతీ = అన్నము గలది; ధేనుమతీ = గోవులు గలది; (ఇరావతీ = జలములు గలది; ధేనుమతీ = జలములను మేఘములుగా ధరించు కిరణములు గలది.) భూతం = జీవరాసులు గలది; సూ = ప్రసవించుట గలది; యవశినీ = గడ్డి మొలచుట గలది; మనుషే =

మనువునకు, మానవునకు; దశస్యా = దానము చేయుచు; వ్యస్తభ్నా = వేరువేరుగా స్తంభింప చేయుటచేత; రోదసీ = భూమ్యాకాశముల నడిమి భాగము; విష్ణో = ఓ విష్ణుదేవా! యేతే = వానిని; పృథివీః అభితః = భూమి కభిముఖముగా; మాయూఖైః = కిరణములచేత; దాధర్థ = ధరించి ఉంటివి.

తాత్పర్యము : ఓ విష్ణుదేవా! నీవీ రోదసీ కుహరమును నిలిపి పృథివిని, దివమును వేరువేరుగా నుండునట్లు స్తంభించి పట్టితివి. ఈ పృథివికి అభిముఖముగా సూర్య కిరణమాలను ప్రసరింప జేయుచున్నావు. దాని వలన భూమిపై జలము లేర్పడినవి. అవి మేఘములుగా నేర్పడినవి. అవి వర్షించినవి. అన్నమేర్పడినది. పచ్చిక చక్కగా పెరుగుచున్నది. దానిని తినునట్టి ధేనువు లేర్పడినవి. జీవులన్నియు ప్రసవించుట ఏర్పడినది. ఈ మొత్తము సంపదను నీవు మనువునకు దానము చేసితివి. అతడు మానవునకు దానము చేసెను.

ఉరు యజ్ఞాయ చక్రథురు లోకం
జనయంతా సూర్య ముషాస మగ్నిమ్ ।
దాసస్య చిద్ వృషసిప్రస్య మాయా
జఘ్నథుర్నరా పృతనాజ్యేషు ॥ 4.

టీక : యజ్ఞాయ = యజ్ఞము కొరకు; ఉరుమ్ = వేగమును, విస్తృతిని; చక్రథుః = వీరిరువురును చేయుచున్నారు; ఉరు = వేగవంత ముగను, విస్తారముగను; లోకమ్ = ఈ జీవ లోకమును; జనయంతా = కలుగ జేయుచున్నారు; సూర్యం = సూర్యుని; ఉషాసం = ఉషస్సును; అగ్నిమ్ = అగ్నిని; దాసస్య = దాసుడగు; వృషశిప్రిస్య = వృషశిప్రుడను

వానికి; (వర్షముల వలన మొలచునట్టి దేహధారి అగువానికి) మాయాః చిత్ = ఎట్టి మాయనైనను; జఘ్నథుః = బ్రద్దలు గొట్టుదురు; నరా = నరులై; పృతనాజ్యేషు = సేనల వినియోగములందు;

తాత్పర్యము : ఓ ఇంద్రా విష్ణువులారా! మీరు విస్తృతిని, వేగమును కలుగ జేయుదురు. ఈ లోకమును వేగవంతముగను, విస్తృతముగను, జీవ లోకముగా నిలుపుదురు. దాని కొరకై సూర్యుని పుట్టింతురు. వాని కొరకై ఉషస్సును పుట్టింతురు. దాని కొరకై అగ్నిని పుట్టింతురు. వర్షము వలన నుద్భవించునట్టి లక్షణముచేత వృషశిప్రుడు అని పిలువబడు దేహధారి యగు మీ దాసునకుగల ఎట్టి మాయనైనను మీరు తొలగింతురు. సేనల వినియోగమున నరులై సేనానాయకులై ముందు నడచి కార్యసాధన చేయుదురు.

వివరణము : యజ్ఞమనగా ఫలాపేక్ష లేక చేయునట్టి విశ్వశ్రేయమైన సత్కర్మము. యజ్ఞములలో మొట్ట మొదటిది సృష్టి కర్మ. దానికై అంతర్యామి ప్రజ్ఞయు, ఇంద్రియాధిపతి అయిన మనస్సు యొక్క ప్రజ్ఞయు కావలెను. ఆ రెండిటికిని విష్ణువు, ఇంద్రుడు అనువారు అధి దేవతలు వీనిని ఉద్భవింపజేయుటకు లోకములను కల్పింపవలెను. వానిని కల్పించు వాడుగా మొదట సూర్యుని కల్పింపవలెను. దానిని కల్పించునదిగా ఉషస్సును కల్పింపవలెను. ఉషస్సు అనగా సూర్యోదయమునకు ముందు ప్రసరించు వెలుగు. మన సూర్యోదయమునకై గాక సూర్యుని పుట్టుకకు ముందుకూడ ఉషస్సు పుట్టును. అది సూర్య తేజస్సును నిర్మాణము చేయునట్టి అనంతమైన వెలుగు. దానిని పుట్టించుటకు ముందు అగ్ని కావలెను. అగ్ని అనగా అంగముల యందు విహితమై మనలో జీవుడుగా వెలుగొందునది. మరియు అగ్రము నందు కొని రాబడునది (అన్నిటికన్న ముందు పుట్టునది) అని అర్థము. అది

అవ్యక్తము యొక్క మొదటి రూపమైన మహత్తు నుండి వ్యక్తమగు అహంకారము. (ఇది జీవుల అహంకారము కాక ఒక సృష్టికి మొదటి అహంకారము. ఇది బిందువువలె వ్యక్తమగును. అంతర్యామియైన విష్ణుత్వము నుండియే ఇది వ్యక్తమగు చుండును. కనుకనే "దేవత లందరిలో అగ్ని మొదటివాడు, విష్ణువు చివరివాడు" అని ఐతరేయము బోధించు చున్నది.) ఈ విధముగా ఉషస్సు కొరకై అగ్నిని మీరిద్దరును తెచ్చుచున్నారు.

విష్ణుని వర్షాశక్తి వలన భూమిపై పుట్టిన జీవుడు వృషశిప్రిడు అను పేరుతో వ్యవహరింప బడుచున్నాడు. అతడు విష్ణుని యందు భాగమై జీవించు చున్నందున విష్ణునకు దాసుడు. వానికి ఇంద్రియ సుఖముల యందును, సంపదల యందును చిక్కు కొనుట కలుగుచుండును. దానినే మాయ అందురు, దానిని తొలగించుటకు విష్ణుని అంతర్యామి ధ్యానమే తోడ్పడును. మంచి చెడ్డలను గూర్చిన అభిప్రాయములు సేనల వలె బారులు తీర్చి యుద్ధ భూమిని కల్పించు చుండును. ఈ సేనలకు నాయకుడై విష్ణువే వైరాగ్య మార్గమున పరిష్కారము కలిగించి విజయ మును కల్పించును. ఇందలి భావమునే కురుక్షేత్రమున ఉభయ సేనల నడుమ నరునకు సారథిగా నారాయణుడున్నట్లు స్వీకరించి మహాభారత గ్రంథకర్త కృష్ణుని కథతో జోడించెను.

ఇంద్రావిష్ణూ దృంహితాః శంబరస్య
నవ పురో నవతిం చ శ్నథిష్టమ్ ।
శతం వర్చినస్సహస్రం చ సాకం
హథో అప్రత్యసురస్య వీరాన్ ॥ 5.

టీక : ఇంద్రా విష్ణూ! — ఓ ఇంద్రా విష్ణువులారా! ద్రుం

హితాః = ద్రోహముతో నిండినవి అగు (విరిగి పోయినవి అగు); శంబరస్య = శంబరుడను రాక్షసుని యొక్క; నవపురః = తొమ్మిదితో మొదలైన; నవతించ = తొంబదింటిని; శ్నథిష్టమ్ = ఊడ పెరుకుట; వర్చినః = వర్చస్సు కలిగిన; శతమ్ = నూరు; సహస్రమ్ = వేయి; అసురస్య = రాక్షసుని యొక్క; వీరాన్ = వీరులను; హయంచ = గుర్రమును; అప్రతి = ఎదురులేక ;

తాత్పర్యము : ఓ ఇంద్రా విష్ణువులారా: మీకు ద్రోహము తల పెట్టిన శంబరుడను రాక్షసుని యొక్క తొమ్మిది పురములను; అటుపైన తొంబది పురములను ఊడ పెరికితిరి. తేజోవంతులగు నూరుగురితో, వేయిమందితో కలసి మీరు రాక్షసుని వీరులను, వారి రథములను, గుర్రములను గూడ మాయము చేసిరి.

వివరణము : పురాణములలో ఇంద్రుడు శంబరాసురుని చంపిన కథకిది మూలము శంబరుడనగా మాయ, లేనిది ఉన్నట్లు కనిపింప జేయుట అని అర్థము. ఈ విద్యను శాంబరీ విద్య అందురు. దీని వలన సృష్టిలో సర్వము విష్ణుమయమే అయినను మనస్సు, ఇంద్రియములు, దేహములు, ఇంద్రియార్థములు, సంపదలు, చుట్టరికములు, కష్ట సుఖములు ముఖ్యగునవి నిజముగా నున్నట్లు నమ్మకము కలగును. దానితో విష్ణుమయమైన సృష్టికి బాధలు కలుగును. కనుక ఇది ద్రోహ రూపమైన నిర్మాణము. ఇది ఇంద్రా విష్ణువుల ధ్యానముచే తొలగిపోవును గనుక వారిరువురును శంబరుని పట్టణములను ఊడ పెరికినట్లు, వారి సైన్యములను చంపినట్లు చెప్పబడినది. శంబరుని రథము లనగా జీవుల దేహములు. గుర్రము లనగా ఇంద్రియములు.

శంబరుని తొమ్మిది పురము లనగా నవద్వారములు గల భౌతిక శరీరములు, తొంబది తొమ్మిది అనగా సంఖ్యలో సృష్టి కర్మయందు

హెచ్చింప బడుచున్న దేహములు. ఇచ్చట ఒకటి అను సంఖ్య మొదటి వాడగు ఇంద్రునకును. తొమ్మిది అను సంఖ్య ఈ నవద్వార పురములను నిర్మించిన శంబరునకును. పూర్ణమను సంఖ్య విష్ణువునకును సూచకములు. తొమ్మిదిని ఒకటి తాకినచో తొమ్మిది మాయమై, ఒకటియు, సున్నయు మిగులును. $(9+1=10)$ అట్లే 99 ని1 తాకినచో $(99+1=100)$ అగును. అనగా శంబరుని పురమును ఇంద్రుడు తాకినచో పురము మాయమై, ఇంద్రా విష్ణువులు మిగులుదురు. వీరిద్దరిచే 10, 100, 1000 మొదలగు సంఖ్యలు పుట్టును. ఇట్లు పుట్టుచున్న జీవులు తాత్కాలికము లైన దేహముల ప్రజ్ఞ నుండి విముక్తి చెంది విష్ణు లోకమున వర్ధిల్లు చున్నారని అర్థము.

ఇయం మనీషా బృహతీ బృహంతో
రుక్రమా తవసా వర్ధయంతీ ।
రరే వాం స్తోమం విదథేషు విష్ణో
పిన్వతమిషో వృజనేష్విందర ॥ 6.

టీక : విష్ణో! = ఓ విష్ణుదేవా : ఇయమ్ = ఈ స్తోత్రము ; మనీషా = ప్రజ్ఞ; బృహత్ = గొప్పది; బృహంతా = విస్తృతి కలుగ జేయునది; ఉరుక్రమా = వేగముచే పెద్దపెద్ద అడుగులు కలిగిన విష్ణువునకు సంబంధించినది; తవసా = పుష్టిచేత; వర్ధయంతి = వర్ధిల్లునది; రరే = సంపదయందు; వాం = మీ ఇరువురును; స్తోమమ్ = స్తుతించుటను; విదథేషు = విధానము చేయుట యందు; వృజనేషు = పాపముల యందు; ఇషో = బాణము వంటిది; ఇందర్ః = ఇంద్రా ! ; పిన్వతం = గ్రోలబడు చున్నట్టిది ;

తాత్పర్యము : ఓ ఇంద్రా విష్ణువులారా! ఈ మీ స్తోత్రము ప్రజ్ఞామయము. చాల మహత్తరమై విస్తృతిని కలుగ జేయును.

ఉరుక్రముడైన విష్ణుని స్తోత్రము పుష్టిని వర్ధిల్ల జేయును. పాపములను బాణమువలె ఖండించును. ఈ స్తోత్రము చక్కగా స్తుతింపబడి గోరిల బడినచో సంపదను సమకూర్చి పెట్టును

వషట్ తే విష్ణవాస ఆ కృణోమి
తన్మే జుషస్వ శిపివిష్ట హవ్యమ్ ।
వర్ధంతు త్వా సుష్టుతయో గిరో మే
యూయం పాత స్వస్తిభి స్సదా నః ॥ 7.

టీక : విష్ణో + ఆసః = 'ఓ విష్ణూ' అని నోట పలుకుట ; తే = నీకు; వషట్ = వషట్కారముగా (నిన్ను నాయందు వసింప జేయునట్టి పదముగా) కృణోమి = చేయుదును; తత్ = ఆ కారణముచే ; శిపివిష్ట = యజ్ఞము నందు వసించువాడా! మే = నాకు; హవ్యం = యజ్ఞమందలి ఆహారమును; జుషస్వ = అనుభవము కలిగింపుము; మే = నాకు; త్వా = నిన్ను; సుష్టుతయః = చక్కగా స్తుతింపబడినవి; గిరః = వాక్కులు; వర్ధంతు = వృద్ధి చెందును గాక! యూయమ్ = మీరు; నః = మమ్ములను; సదా = ఎల్లప్పుడును; స్వస్తిభిః = క్షేమముల చేత; పాత = రక్షింతురు గాక !

తాత్పర్యము : ఓ ఇంద్రా విష్ణువులారా! మేము "ఓ విష్ణూ !" అని పిలువగా ఆ పదము నందు విష్ణువు వసించుచుండును గాక! (శ్రద్ధతో ప్రత్యక్షము చేసికొనుచు నుచ్చరింతుము గాక!) ఆ కారణముచే మా యజ్ఞము నందు మీరు ప్రవేశించి మా అన్నమును యజ్ఞ శేషముగా ప్రసాదింతురు గాక! మిమ్ములను పుష్కలములైన స్తోత్రములతో మేము స్తుతింతుము గాక! అట్టి మా వాక్కులు మీ యెడల వర్ధిల్లును గాక! మీరు మమ్ములను ఎల్లప్పుడును యోగక్షేమములతో రక్షింతురు గాక !

# విష్ణు సూక్తములు — ౨

[ ఋగ్వేదము : మం — 1; సూ — 155; ఛందస్సు — జగతీ
ఋషి — దీర్ఘతమసుడగు ఔచథ్యుడు ]

ప్రవః పాంత మంధసో ధియాయతే
మహే శూరాయ విష్ణవే చార్చత ।
యా సానుని పర్వతానా మదాభ్యా
మహ స్తస్థతు రర్వతేవ సాధునా ॥ 1.

టీక : వః = మిమ్ములను; ప్రపాంతం = రక్షించుచున్న ; అంధసః = ఆహారము యొక్క ; ధియాయతే = బుద్ధిని కల్గించుచున్న ; శూరాయ = శూరుని కొరకు ; విష్ణవే చ = విష్ణుని కొరకు ; మహే = గొప్ప చేయుచు ; అర్చత = అర్చింతురు గాక : యా = ఏ ఇద్దరు (ఇంద్రుడును, విష్ణువు); పర్వతానాం = పర్వతముల యొక్క (పర్వములనబడు విభాగముల యొక్క); సానుని = చరియల యందు ; అదాభ్యా = బ్రద్దలు కొట్టునట్టి లక్షణము లేనివారై ; మహః = తేజోరూపులై ; సాధునా = సాధు స్వభావమైన; అర్వతా ఇవ = కళ్ళెములు గల గుర్రముల వలె; తస్థతుః = స్థిరపడి యున్నారు.

తాత్పర్యము : ఇంద్రా విష్ణువు లిద్దరును, జీవులకు అన్నపానీయముల బుద్ధి కలిగించి వాని రూపములలో వసించు చున్నారు. అట్టి శూరుడైన విష్ణువును, ఇంద్రుని గొప్పచేసి అర్చింతురుగాక : వారిరువురును పర్వతముల సానువులను భగ్నము చేయకే విహరించుచున్నట్లు, లోకముల పర్వముల విభాగముల యందు విహరించు చున్నారు. సాధు స్వభావము గల గుర్రము కళ్ళెముల వలె వారు వెలుగొందు చున్నారు.

వివరణము : ఇంద్రుడు ఇంద్రియముల కధిపతి. విష్ణువు అంతర్యామి. విష్ణువున కింద్రియముల విభాగముండదు. ఇంద్రున కుండును. ఈ భేదము వలననే లోకములను జీవులను పుట్టి అన్న పానీయములను కోరుచు రుచు లనుభవించుచున్నారు. విష్ణువు లోకముల కతీతుడైనను లోకములను బ్రిద్దలు కొట్టడు. ఇంద్రుడు ఇంద్రియముల కధిపతియైనను అధీనుడై వర్తించి అన్నపానీయముల తృప్తిని జీవులకు చేకూర్చును. గుర్రమునకు కట్టబడిన రెండు కళ్ళెములను ఒకే పురోగతికి కారణమైనట్లు ఇంద్రా విష్ణువులు జీవుల పురోగతికి (అన్నపానీయాదుల రుచి నుండి అంతర్యామి రుచియైన పరమ పదమునకు) దారి చేయుచున్నారు.

త్వేషమిత్థా సమరణం శిమీవతో-
రింద్రావిష్ణూ సుతపా వామురుష్యతి ।
యా మర్త్యాయ ప్రతిధీయమానమిత్
కృశానో రస్తు రసనా మురుష్యథః ॥ 2.

టీక : త్వేషం = ప్రకాశము ; ఇత్థా = ఈ విధముగా ; సమరణం = సమన్వయమైన కర్తవ్యము కలిగి; శిమీవతోః = నిర్మాణము చేయువారైన ; ఇంద్రా విష్ణూ = ఓ ఇంద్రా విష్ణువులారా; సుత పా = సోమ పానము చేయువాడు; వాం = మీ ఇద్దరను ; ఉరుష్యతివ = వృద్ధి పొందించుచున్నాడు; యా = ఏ ఇద్దరు; మర్త్యాయ = మరణము గల జీవుని కొరకు; ప్రతిధీయమానం = ఎదురెదురుగా నిలబడినట్టి; ఇత్ + కృశానోః = ఈ విద్యుత్తు అనబడు అగ్నియొక్క; రసనాం = జిహ్వను ; ఉరుష్యథః = ఆహారముచే బలిష్ఠము చేయబడునట్లుగా; అస్తు = సంభవించును గాక ;

తాత్పర్యము : ఓ ఇంద్రా విష్ణువులారా ! మీరిద్దరును రెండు

విధములైన తేజస్సులను ఉద్భవింపజేయుట యందు సామరస్యము గలిగి యున్నారు. అన్నపానీయములను సోమముగా స్వీకరించు జీవుడు మీ ఇద్దరి తేజస్సులను కలిపి వర్ధిల్ల జేయుచున్నాడు. మృత్యువుచే విభాగము చెందినజీవి మీ ఇద్దరి తేజస్సులను రెండు మెరపుతీగల తేజస్సులుగా కలుపుచున్నాడు. తేజస్సుల జిహ్వ లనుసంధానము చేయుచున్నాడు.

వివరణము : ఇంద్రుని తేజస్సు, విష్ణువు తేజస్సు రెండు మెరపు తీగలవలె మెరయు చుండును. జీవుని నాలుక ఈ రెండు తేజస్సులను అనుసంధానము చేయును. సోముడు అనబడు గంధర్వ దేవత జలమున కధిపతియై జీవులకు రుచిని కల్పించుచున్నాడు. దాని వలన అన్నపానీయ ములు జీవులకు సోమరస మగుచున్నవి. పుష్ణామి చౌషధీస్సర్వా స్సోమో భూత్వా రసాత్మకః" అని భగవద్గీత వివరించు చున్నది. సోముడు రుచి కధిపతియైన ఓషధులను సమస్తమును పోషించు చున్నాడని దీని భావము.

జీవుడు, దేవుడు అను ప్రజ్ఞలు పరస్పర భిన్నములైనను సామ రస్యము గలవి. రెండు వెలుగులు కలిసినపు డొకే వెలుగైనట్లు జీవుడు అన్నపానీయాదుల రుచుల ననుభవించుటతోనే సోపాన క్రమమున అంత ర్యామి యందు మేల్కొను చున్నాడు. ఇట్టి రెండు విధములైన ప్రజ్ఞల కును ఇంద్రా విష్ణువు లిరువురును కారణ మగుచున్నారు.

తా ఈం వర్ధంతి మహ్యస్య పౌంస్యం
ని మాతరా నయతి రేతసే భుజే ।
దధాతి పుత్రోఽవరం పరం పితు-
ర్నామ తృతీయ మధి రోచనే దివః ॥ 3.

టీక : తాః=వారు (సోమపానము చేయువారు); ఈం=దీనిని; మహి వర్ధంతి=చక్కగా విస్తారము చేయుచున్నారు; అస్య=ఈ ఇంద్రా

విష్ణువుయొక్క; పౌంస్యం = పుష్టికరమైన; మాతరా = నిర్మాణము చేయు జలములను ; భుజే = అనుభవించుట కొరకు ; రేతసే = బీజశక్తి కొరకు; నినయతి = కొనివచ్చు చున్నాడు; పుత్రః = పుత్రుడై : అవరం = తక్కువవాడుగా; పితుఃనామ = తండ్రియను పేరున; పరం = ఎక్కువవాడుగా; తృతీయం = మూడవవాడుగా; దివః అధి = వెలుగుల లోకము నధిష్ఠించి; రోచనే = ప్రకాశము నందు; అధి = అధిష్ఠించి ; పౌంస్యం = పుంసత్వమును ; దధాతి = ధరించుచున్నాడు.

తాత్పర్యము : ఆ సోమపానము చేయు జీవులు ఈ విధముగా వర్తిల్లు చున్నారు. జలములను సృష్టి నిర్మాణ కర్తలైన బీజాంకుర శక్తులుగా స్వీకరించు చున్నారు. వాని వలననే చిన్నవాడగు పుత్రుడు, పెద్దవాడగు తండ్రి పేరు ధరించి భూమ్యాకాశముల నడుమ మూడవ వాడగు వెలుగుగా నేర్పడు చున్నాడు.

వివరణము : జలములు పానీయముల రూపముననూ, రుచులు కల్పించు రూపముననూ సృష్టి నిర్మాణ కర్తలుగా వర్తించుచున్నవి. అవే జలములు ఆహార సారమైన రేతస్సుగా నేర్పడుచు బీజాంకురశక్తి నికలుగ జేయుచున్నవి. వాని మహిమ వలన పుత్రుడను పేరుతో చిన్నవాడుగా పుట్టి, దేహముతో పెరిగి పెద్దవాడై తండ్రియను పేరు ధరించుచున్నాడు. భూమి ఆకాశము తల్లిదండ్రులుకాగా పుత్రుడు సృష్టిరూపమై జీవుడుగా మూడవవా డగుచున్నాడు. ఈ విధముగా పుంస్త్వము అనబడు లక్షణము ఇంద్రావిష్ణువుల నడుమ రసాత్మకమైన సోమ శక్తిగా సృష్టి కర్మను నిర్వర్తించుచున్నది. "రసోహమప్సు కౌంతేయ - బీజం మాం సర్వ భూతానాం" అనియు భగవద్గీత చెప్పుచున్నది. "తత్ సృష్ట్వా తదేవాను ప్రావిశత్" (దానిని సృష్టించితానే దానియందంతర్యామిగా ప్రవేశించెను) అని తైత్తిరీయము చెప్పుచున్నది. "అప ఏవ ససర్జాదౌ, తాసు వీర్య

మపాసృజత్" (మొదట జలములను సృష్టించి వానియందు బీజాంకుర శక్తిని విడిచి పెట్టెను) అని మనువు చెప్పుచున్నాడు.

తత్తదిదస్య పౌంస్యం గృణీమసీ
నస్య త్రాతు రవృకస్య మీఢుషః ।
యః పార్థివాని త్రిభిరి ద్విగామభి
రురు క్రమిష్టోరుగాయాయ జీవసే ॥ 4

టీక : తత్ + తత్ + ఇత్ = ఆయా విధములై ఈ విధముగా దిగివచ్చిన; అస్య = వీనియొక్క; విష్ణోః = విష్ణువు యొక్క; పౌంస్యం = పుంస్త్వమును; గృణీమసి = గ్రహింపదగిన దానినిగా; త్రాతుః = రక్షకుడైన; ఇనస్య = సూర్యుని యొక్క; అవక్రస్య = వక్రమార్గము లేని వాని యొక్క; పౌంస్యం = పుంస్త్వమును; మీఢుషః = స్తోత్రము చేయుచున్నాను; యః = ఎవడు; పార్థివాని = పృథివీ రేణువులను; త్రిభిః = మూడు విధములైన; ఇత్విగామభిః = ఈ విధములైన గమనముల చేత; ఉరుక్రమిష్ఠ = వేగములే ఉత్తమ మార్గములుగా గల; ఉరుగాయాయ = వేగ గమనములే గానముగా గల వానికొరకు; జీవసే = జీవితము కొరకు.

తాత్పర్యము : ఆయా విధములైన ఇంద్రావిష్ణువుల పుంస్త్వమే ఈ విధమైన జీవుని జీవత్వముగా గ్రహించి స్తుతించుచున్నాము. వక్రము లేని సూర్య కిరణముల మార్గములే దానిని రక్షించు చుండును. ఆ మార్గమున మూడు దారులుగా దిగివచ్చి వేగములే తన మార్గములు కాగా విష్ణువు జీవులను రక్షించు చున్నాడు.

వివరణము : ఇంద్రియముల కధిపతియగు నింద్రుడు, అంతర్యామి యగు విష్ణువు తమ తమ పురుషత్వమును సమన్వయించి ఈ జీవుని

పురుషత్వముగా రూపొందించు చున్నారు. దానికి అవక్రిములైన సూర్య కిరణములే రక్షణ మార్గ మేర్పరచుచు జీవులను సృష్టించు చున్నవి. ఇట్లు మూడడుగులలో మూడు మార్గములుగా దిగివచ్చు వేగవంతములైన గ్రహ ముల కక్ష్యలలో, గ్రిహ గమన మే తన గమనముగా దిగివచ్చి విష్ణువే జీవులుగా జీవించు చున్నాడు.

గ్రహముల ఆకారములును, గమనములును, వలయములు గనుక వక్రిములు. సూర్యుని కిరణముల దారులు సూటియైనవి. ఈ రెండిటి ప్రభావమున అణువులు, పరమాణువులతో రజస్సు లేర్పడి పృథివీ తత్త్వ మేర్పడు చున్నది. దానిపై అణువులే ఇంద్రిని తేజస్సు వలన జీవులుగా నేర్పడు చున్నారు.

ద్వే ఇదస్య క్రిమణే స్వర్దృశో
అభిఖ్యాయ మర్త్యో భురణ్యతి ।
తృతీయ మస్య నకిరా దధర్షతి
వయశ్చ న పతయంతః పతత్రిణః ॥ 5.

టీక : అస్య = ఈ జీవుని యొక్క, లేక ఈ విష్ణువు యొక్క; ఇత్ = ఈ స్థితి యందు, లేక అంతర్యామిత్వము నందు; ద్వే క్రమణే = రెండు మార్గము లేర్పడు చున్నవి; స్వర్ దృశః = స్వర్లోకము, కన్నులు; అభిఖ్యాయ = చెప్పబడి, వ్యాపించి; మర్త్యః = మృత్యువు గల జీవుడు; భురణ్యతి = చరించును; అస్య = ఈ విష్ణువు యొక్క; తృతీయం = మూడవ మార్గమును; నకిరా = ఎవ్వరును; దధర్షతి = ధారణ చేయలేరు; పతత్రిణః = రెక్కలు గల జీవులు; వయశ్చ = ఆకాశమున చరించునవి; న పతయంతః = ఓడింప లేవు.

తాత్పర్యము : భూమ్యాకాశముల నడుమగల మర్త్యునకు విష్ణుని మూడు మార్గములలో రెండు మార్గములు అంతుపట్టునవై యున్నవి. వానియందు మర్త్యుడు చరించుచుండును. మూడవ మార్గమును ఎవ్వరును ఆక్రమింప లేరు. రెక్కలు గల పక్షులు గూడ అధిగమింపలేవు.

వివరణము : జీవు లన్నిటికిని పృథివీ తత్త్వము, ఆకాశతత్త్వము నడుమ పుట్టి పెరిగి చచ్చుటయే సాధ్యము. దిగువకు దిగివచ్చి పృథివీ తత్త్వమున దేహములు ధరించుట, మీదకు ఊర్ధ్వగతిపట్టి ఆకాశమున ప్రజ్ఞయను వెలుగుగా ఆ దేహములయందు చరించుట మాత్రమే సాధ్యము. విష్ణువు యొక్క మూడవపాదము అగు అంతర్యామి తత్త్వమున జీవులు చరించుట సాధ్యము కాదు. అనగా జీవులు భూమ్యాకాశముల నడుమ దేహములుగా, అందలి ప్రజ్ఞలుగా మాత్రమే యుండగలవు. అంతర్యామి తత్త్వమును పూర్తిగా అనుభవింప లేవు.

పక్షు లనగా భూమిని వదలి మీది కెగురునవి. దేహ బంధమును వదలి ఆత్మ జ్ఞానమున చరించువారికి సంకేతములు. అట్టి ముక్తాత్మలు కూడ విష్ణువు మూడవ పాదము మహిమను కొంతవరకే గమనింప గలవని అర్థము.

చతుర్భిస్సాకం నవతిం చ నామభిః
చక్రం న వృత్తం వ్యతీం రవీవపత్ ।
బృహచ్ఛరీరో విమిమాన ఋక్వభిః
యువా కుమారః ప్రత్యేత్యాహవమ్ ॥ 6.

టీక : చతుర్భిః సాకం = నాలుగింటితో కూడిన ; నవతించ = తొంబది యగు; నామభిః = ముడుతల చేత ; నవృత్తం = పరిధిలేనట్టి; చక్రం = చక్రము; వ్యతీన్ = వివిధ రూపములను; అవీవపత్ = కంపింప

జేయును; బృహత్ + శరీరః = పరిమాణములేని శరీరము గలదియై; ఋక్వభిః = కిరణముల చేత; విమిమాన = విశేషములైన కొలతల నేర్ప రచినది; యువా కుమారః = యువకుడగు సుందర పురుషుడు; ఆహవం = సంపూర్ణ హోమముగా; ప్రత్యేతి = ప్రతిముఖముగా తిరుగుచున్నాడు.

తాత్పర్యము : తొంబది ముడుతలు గల నాలుగు విభాగములతో పరిధిలేని చక్రము సర్వ జీవులను కంపింప జేయుచున్నది. పరిమాణము నకు మించిన శరీరము గలవాడై యువకుడగు కుమారుడు తన కిరణము లతో విశేష మానముల నేర్పరచి సంపూర్ణ హోమ స్వరూపుడై ఎదురు బదురుగా తిరుగు చున్నాడు.

వివరణము . చోటులో ప్రతి బిందువు చుట్టును 360 ముడుత లుండును. 90 ముడుతలొక విభాగముగా నాలుగు భాగము లేర్పడు చుండును. కేంద్రము చుట్టును ఇది పరిధిలేని చక్రముగా నేర్పడును. అనగా నొక్కొక్క పరిధికి నొక్కొక్క చక్రాకార మేర్పడును. ఇట్లు సూర్యుని చుట్టును బింబాకార మేర్పడు చున్నది. గ్రహముల కక్ష్య లేర్పడు చున్నవి. కంటి చుట్టును భూమ్యాకాశములు కలసినట్లు కను పించు దృశ్య చక్ర మేర్పడుచున్నది. అహోరాత్రములుగా భూమి చుట్టును, సూర్యుని దృశ్యమార్గ మేర్పడు చున్నది. అందు ఉదయము, మధ్యాహ్నము, అస్తమయము, అర్ధరాత్రము అను నాలుగు విభాగము లేర్పడు చున్నవి. సంవత్సరమున విషువములు, ఆయనములు నేర్పడు చున్నవి. భూమధ్య రేఖ చుట్టును రాశిచక్ర మేర్పడు చున్నది. ఇన్నిటికి కేంద్రముగా పనిచేయు ప్రజ్ఞ, జీవుడుగా దేహములు ధరించుచు కాలము అను కొలతలుగా ఆయుర్దాయము పొందుచున్నది. దేహముల నతిక్రమించి శాశ్వత మూర్తిగా విష్ణులోకమున గూడ వెలుగొందు చున్నది గనుక ఈ చక్రమునకు పరిధిలేదు.

ఈ చక్రమే ఇతిహాస పురాణములలో విష్ణు చక్రముగా వర్ణింపబడినది. ఇందలి 360 ముదుతల తోడి చతురస్రాకారమైన ప్రజ్ఞయే కుమారు డనబడు సుబ్రహ్మణ్యేశ్వరుని శక్తిగా వర్ణింపబడినది. ఇదే ఆకారము ఇంద్రుని వజ్రముగా కూడ వర్ణింపబడినది.



ఇదే ఆకారము సృష్టి కర్మయందు చతుర్ముఖ బ్రహ్మగా వర్ణింపబడినది. ఇందలి నడిమి నాలుగు విభాగములే చతుర్భుజుడైన విష్ణువుగా వర్ణింపబడినది. వాని కేంద్రమే విష్ణుని నాభికమలముగా వర్ణింపబడినది.

## విష్ణు సూక్తములు – 3

[ ఋగ్వేదము : మం – 1; సూ – 22 (ఋక్ – 16 నుండి)
ఛందస్సు-గాయత్రీ; ఋషి–కాణ్వుడైన మేధాతిథి ]

అతో దేవా అవంతు నో
యతో విష్ణుర్విచక్రమే ।
పృథివ్యాః సప్త ధామభిః ॥ 16.

టీక : పృథివ్యాః = పృథివియొక్క ; సప్తధామభిః = ఏడు

వెలుగుల చేత; విష్ణుః = విష్ణువు; యతః = ఎచ్చట నుండి; విచక్రమే = విక్రమించెనో; అతః = అక్కడ నుండి; నః = మమ్ములను; దేవాః = దేవతలు; అవంతుః = రక్షింతురు గాక !

తాత్పర్యము : ఈ పృథివికి చుట్టును ఏడు వెలుగుల దారులలో నెచ్చట నుండి విష్ణువు విక్రమించెనో అక్కడ నుండియే దేవతలు మమ్ము రక్షింతురు గాక !

వివరణము : సూర్యుని నుండి పృథివి వరకు గల దారులు ఏడు లోకములుగా విభజింపబడినవి. అవి అంతర్యామి యగు విష్ణువు యొక్క సూర్యత్వము నుండి పృథివి యందలి జీవుల స్థితి వరకును స్థూల స్థూలముగ దిగి వచ్చునట్టి లోకములు. ఇందొక్కొక్క దాని వేగము, ప్రజ్ఞ యొక్క మెలకువ, అనుభూతి వేరువేరుగా నుండును. దేహధారుల అనుభవము పృథివీ తత్త్వమున సంపూర్ణమగును. దేవుడు మానవుడుగా దిగివచ్చి దేహేంద్రియ మనస్సులలో చిక్కుకొని పుట్టి, మరల నూర్ధ్వ గతిలో విష్ణుని అంతర్యామిత్వము ననుభవించుట మోక్ష మార్గము. దీని కొరకే విష్ణుమయములై ఏడు లోకములును సృష్టిగా నేర్పడినవి. అందొక్కొక్క దాని గమనము ఒక్కొక్క ఛందస్సు అనబడును. ఈ ఛందస్సుల ననుసరించియే భూమి జీవులకు సూర్యుని దారులు ఏడు కిరణములుగా నేర్పడును, అందేడు రంగు లేర్పడును.

విక్రమము అనగా విశేషముగా ఆక్రమించుట.

ఇదం విష్ణు ర్విచక్రమే
త్రేధా ని దధే పదమ్ ।
సమూళ్హమస్య పాంసురే ॥ 17

టీక : ఇదం = ఈ మూడు లోకముల, ఏడు లోకముల సృష్టిని; విష్ణుః = విష్ణువు; విచక్రమే = విక్రమించెను; త్రిధా = మూడు విధములుగా; పదం = తన మార్గమును; నిదధే = స్థాపించెను; అస్య = దీని యొక్క; సమూళ్హమ్ = సమారోహణము; పాంసురే = పాంసువుల యందున్నది (ధూళి రేణువుల యందున్నది.)

తాత్పర్యము : ఈ ఏడు లోకముల సృష్టి యందును విష్ణువే అంతర్యామిత్వము కలిగి ఆక్రమించెను. మూడడుగులుగా మార్గమును స్థాపించెను. దాని సమారోహణము ధూళి రేణువుల యందున్నది.

వివరణము : పై చెప్పబడిన ఏడు లోకముల విభాగము నందు విష్ణువు మూడు పదములతో ఆక్రమించెను. అవియే ద్రవ్యమయము, శక్తిమయము, ప్రజ్ఞామయము అనబడు లోకములు. దాని ఆరోహణ మార్గమే పృథివి యందలి రేణువుల నుండి ప్రారంభమగును. అనగా భూమి యందలి ఖనిజములతో అణువులమయముగా భౌతిక దేహము లేర్పడును. అందు చిక్కుకొనిన జీవులు క్రమముగా ఊర్ధ్వగతి పట్టుటకు ఆరోహణ మార్గ మేర్పడును.

త్రీణి పదా విచక్రమే
విష్ణుర్గోపా అదాభ్యః ।
అతో ధర్మాణి ధారయన్ ॥ 18

టీక : గోపా = గోపకుడగు (రక్షకుడగు), విష్ణుః = విష్ణువు; అదాభ్యః = దానముల చేత; త్రీణి పదా = మూడడుగులతో; విచక్రమే = విక్రమించెను; అతః = ఇచ్చట నుండి; ధర్మాణి = సృష్టి ధర్మములను; ధారయన్ = ధరించుచు.

తాత్పర్యము : రక్షకుడగు విష్ణువు తన్ను తాను సృష్టిగా దానము చేసికొనుట చేత మూడడుగులతో విక్రమించెను. ఆ మార్గముననే సృష్టి ధర్మములను ధరించెను.

వివరణము : లోకముల యందు విష్ణువే అంతర్యామి కనుక తన్ను తాను సృష్టిగా దానము చేసికొనెను. (వాని నుండి పుట్టిన దేవతలు వానిని యజ్ఞ పశువుగా బంధించి సృష్టి చేసెనని పురుష సూక్తము చెప్పుచున్నది.) కనుక ఈ సృష్టి యందలి సమస్త ధర్మములను తనయందే ధరించి మొలిపించెను. ధర్మము లనగా పదార్థ ధర్మములు, ఇంద్రియ మనో దేహాదుల ధర్మములు. వాని సమన్వయము వలన వ్యక్తమగు మోక్ష ధర్మములు.

విష్ణువు తన్ను తాను దానము చేసికొనగా అహంకార రూపుడగు జీవుడు తన కున్న దానిని దానము చేయును. ఆ లక్షణమును మార్చి తన ధర్మమును స్థాపించుటకు విష్ణువు తన మూడవ పాదమును ప్రయోగించును. అదియే పరమ పదము లేక మోక్షము. ఈ అంశమే బలిచక్రవర్తి కథగా పురాణములలో వర్ణింపబడినది.

విష్ణోః కర్మాణి పశ్యత
యతో వ్రతాని పస్పశే।
ఇంద్రస్య యుజ్యస్సఖా॥ 19.

టీక : ఇంద్రస్య = ఇంద్రుని యొక్క; యుజ్యః = సహచరత్వము చేయునట్టి; సఖా = స్నేహితుడగు; విష్ణోః = విష్ణువు యొక్క; కర్మాణి = సత్కర్మలను; పశ్యత = గమనింతురు గాక; యతః = వేని నుండి; వ్రతాని = వ్రతములను; పస్పశే = స్పృశించెనో.

తాత్పర్యము : ఇంద్రునితో యోగము చెంది సహచరుడై తిరుగునట్టి విష్ణువు యొక్క సత్కర్మలను శ్రద్ధతో గమనింపుడు. అట్లు గమనించుట వలన వ్రతములను తిన్నగా స్పృశించిన వారగుచున్నారు.

వివరణము : విష్ణువు అంతర్యామి ప్రజ్ఞ. ఇంద్రుడు ఇంద్రియముల కధిపతి యగు మనస్సు నందలి ప్రజ్ఞ. ఈ రెండు ప్రజ్ఞలను దేవుడు, జీవుడు అందురు. అందు దేవుని కర్మలు దివ్యములు. అనగా సత్కర్మలు. అవియే ఈ సృష్టి కర్మలు. వాని ప్రయోజనము తనది కాదు కనుక అవి యజ్ఞ కర్మలు. వానిని మానవుడు శ్రద్ధతో పరిశీలించినచో తన కర్మ లెట్లాచరింపవలెనో తెలియును. జీవితము యజ్ఞార్థ కర్మగా మారును. అప్పుడతడు యజ్ఞ యాగాదు లందలి వ్రతములను నిజముగా స్పృశించిన వాడగును. (దీనివలన జీవుల యందు దేవుని చూడనివాడు, సమర్పణ బుద్ధితో తన కర్తవ్యము లాచరింపనివాడు యజ్ఞములు చేసినను, అవి యజ్ఞములు కావని తెలియుచున్నది. ఈ యొకే విషయమును బహు విధములుగా స్పష్టపరచుటకై నారదుడు వ్యాసుని ముఖమున భాగవతమును లోకమున కందించెను.)

తద్విష్ణోః పరమం పదం
సదా పశ్యన్తి సూరయః ।
దివీవ చక్షురాతతమ్ ॥ 20

టీక : తత్ = అది; విష్ణోః = విష్ణువు యొక్క; పరమం పదమ్ = అతీతమైన మార్గము; దివి = దేవలోకమున; ఆతతమ్ = వ్యాపించిన; చక్షుః + ఇవ = కన్నువలె పనిచేయును; సూరయః = జ్ఞానులు; సదా = ఎల్లప్పుడును; పశ్యంతి = చూచు చుందురు.

తాత్పర్యము : పైనవర్ణింపబడిన విష్ణువు యొక్క మూడవ పదము అన్నిటికన్న అతీతమైనది. దానిని పరమపద మందురు. అది దేవలోక మందంతయు వ్యాపించి కన్నువలె చూచుచున్న వెలుగు. దానినే జ్ఞానులు ఎల్లప్పుడును చూచుచుందురు.

వివరణము : ఇచ్చట సూర్యుని వెలుగునకును, విష్ణుని వెలుగునకును గల భేదము చెప్పబడినది. సూర్యుని వెలుగు జీవుల కంటిచే చూడబడును గాని స్వయముగా చూడదు. విష్ణుని వెలుగు చక్షుస్సునకు సంబంధించినది కాదు. ప్రజ్ఞకు సంబంధించినది. దానితో నిండి యున్నదే దివ మనబడు లోకము. ఇది జీవుల లోపల ప్రజ్ఞగా నున్నను వెలుపల అంతర్యామిత్వముగా నున్నను, చూచుచునే యుండును గాని చూడబడదు. ఈ లోకమున జీవులు విష్ణువుగా విహరింతురుగాని జీవులుగా చరింపరు.

తద్విప్రాసో విపణ్యవో
జాగృవాంస స్సమింధతే।
విష్ణోర్య త్పరమం పదమ్॥ 21

టీక : తత్ = దానిని; విప్రాసః = విప్రులు; విపణ్యవః = విశేషముగా విలువగట్టుకొనువారై; జాగృవాంసః = దానియందు మేల్కొనిన వారై; సమింధతే = దానినే వెలిగించు చున్నారు; యత్ = ఏది; విష్ణోః = విష్ణువు యొక్క; పరమంపదమ్ = అతీతమైన మార్గము.

తాత్పర్యము : అతీతమైన పరమపద మనబడు విష్ణు మార్గమును విప్రులు శబ్దార్థములతో విలువ గట్టుకొనుచు, దానియందు మేల్కొని యుండి దానినే వెలిగించుచున్నారు.

వివరణము : విప్రులనగా విశేష ప్రజ్ఞ కలవారు. వారు శబ్దార్థములతో విష్ణుపదమునే విలువ గట్టుకొనుచున్నారు. అనగా ఏపదమునకైనను శబ్దము విష్ణువనియు, అర్థముగా కనుపించు వస్తువు విష్ణుని రూపమనియు ధారణ చేయుచున్నారు. శబ్దార్థములను వానియందు సమర్పణ బుద్ధితో వాడుచున్నారు. సకల జీవరాసుల వ్యవహారమునను, విష్ణువు నందే మేల్కొని యున్నారు. కనుక వారిలోని ప్రజ్ఞలన్నియు విష్ణుని వెలుగులై పోవుచున్నవి. ఈవిధముగా ఎంతమంది వర్తించుచున్నారో అంతగా విష్ణుని వెలుగును వెలిగించుచున్నారు.

## వి ష్ణు సూ క్త ము లు — ౪

[ ఋగ్వేదము : మం – 7; సూ – 100; ఛందస్సు – త్రిష్టుప్;
ఋషి : మైత్రావరుణుడగు వశిష్ఠుడు ]

నూ మర్తో దయతే సనిష్యన్
యో విష్ణవ ఉరుగాయాయ దాశత్ ।
ప్రయ స్సత్రాచా మనసా యజాత
ఏతావంతం నర్యమా వివాసాత్ ॥ 1

టీక : నూ = వెంటనే; మర్త్యః = మృత్యువు కల జీవి; సనిష్యన్ = భక్తి చేయుచు; యః = ఎవడు; ఉరుగాయాయ = వేగములే గానముగా గల; విష్ణవే = విష్ణువుకొరకు; దయతే = దానము (సమర్పణము) చేయుచున్నాడో; యః = ఎవడు; సత్రాచా = సత్రమనబడు యజ్ఞముతో గూడిన; మనసా = మనస్సుతో; ఏతావంతం = ఇంతవానిని; నర్యమా = నరత్వ నియమములతో; వివాసాత్ = వైదొలుగుటమాని (ఇతర దేవతల

దృష్టిమాని) ప్రయజాత = (అతడు) ఉత్తమ యజ్ఞము చేసినవాడు; దాశత్ = అర్పణము చేసెను.

తాత్పర్యము : ఏ మానవుడు సత్వరము జీవితమున సమర్పణ బుద్ధికలిగి భక్తియోగమును పొందుచున్నాడో, ఎవడు యజ్ఞార్థ బుద్ధితో సకల కర్మలను తనవిగా దలపక విష్ణువునకు నివేదించుచున్నాడో. విష్ణువనగా ఇంతవాడని (అంతర్యామి యని) తెలియ గలుగుచున్నాడో. ఎవడు ఇతర దేవతల యందు అన్యబుద్ధిమాని వైదొలగి అన్యములేని అనుభవము చెందుచున్నాడో. ఎవడు సత్రయాగబుద్ధితో విష్ణుని ప్రస్తావించు చున్నాడో అతడే ఉత్తమ యజ్ఞము చేసినవాడు.

వివరణము . దేహము. మనస్సు. ఇంద్రియములు, ఇంద్రియార్థములైన సంపదలు తనవేయని నమ్మి జీవించుట ఒక పాదము. ఇవన్నియు అశాశ్వతములని తెలిసి, ధర్మాధర్మముల నెరిగి వైరాగ్య బుద్ధి కలిగి, దైవభక్తి కలిగి పవిత్రుడగుటకై యజ్ఞాది సత్కర్మ లాచరించి భవ బంధములను త్రెంచుకొని యుత్తమానంద మభిలషించుట రెండవ పాదము. మొదటివానికి అన్నియు తనవి యనియు, రెండవ వానికి అన్నింటిని మించిన ఉత్తమానందము (మోక్షము) తనది యనియు భావముండును. ఇద్దరకును సంగము విడువదు. ఈ రెండు విధములుగా జీవించువారి యందు అంతర్యామిని చూచుట మూడవ పాదము. అదే విష్ణుపదము లేక పరమపదము. వానికి అన్య దేవతలుగాని ఇష్టదేవత గాని యుండరు. అన్యభావన లేనప్పుడు తనయందే అతనికి అన్య ముండదు. ఈ స్థితినే కృష్ణుడు భగవద్గీతలో అనన్య భక్తి, అనన్య చింత అని ప్రశంసించినాడు. ఇదిలేక ఇష్ట దేవతల నర్చించువారు సద్గతి కోసమై అర్థించి పుణ్యలోకముల ననుభవించి మరల మర్త్యలోక ప్రజ్ఞలో జీవించు చున్నారనియు చెప్పెను.

సత్రిమనగా పెద్దలోకచోట చేరిన యజ్ఞము. అందు వాక్కులను అంతర్యామి భావనలో నర్పించి అర్థమును అంతర్యామిగా భావించి జీవించిన వాడు నిజమైన యజ్ఞము చేసినవాడు.

త్వం విష్ణో సుమతిం విశ్వజన్యా
మ ప్రయుతామేవయావో మతిం దాః ।
పర్చో యథా న స్సువితస్య భూరే
రశ్వావతః పురు శ్చంద్రస్య రాయః ॥ 2

టీక : విష్ణోః=ఓవిష్ణుదేవా! విశ్వజన్యాం=సర్వజీవుల క్షేమము కోరునట్టి;ప్రయుతాం=యుక్తమైనట్టి;సుమతిం=సద్బుద్ధిని;ఏవయావః= పొందుచున్నాము; త్వం=నీవు; మతిందాః=మనన శీలమును ప్రసాదింపుము; యథా=ఏవిధముగా; నః=మాకు; సువితస్య=శుభమైన జ్ఞానపై ఐరికి; భూరేః=విస్తారమైన; అశ్వావతః=అశ్వముల కలిమి యొక్క; పురుః చంద్రిస్య=మాటిమాటికిని అహ్లాదకరములైన వృద్ధుల యొక్క; రాయః=సంపదలయొక్క; పర్చః=సంపర్కము కలుగునో.

తాత్పర్యము : ఓ విష్ణుదేవా! నాకు విశ్వజన శ్రేయోదాయకమైన సద్బుద్ధిని ప్రసాదింపుము. ఎట్లు ప్రవర్తించినచో నాకును, లోకమునకును శుభమగునో, అశ్వసంపద, ధనధాన్య వసు వాహనాది సంపదలు వర్ధిల్లునో అట్టి ప్రవర్తన యందు నాకు బుద్ధిని కలిగింపుము.

త్రిర్దేవః పృథివీమేష ఏతాం
విచక్రమే శతర్చసం మహిత్వా ।
ప్ర విష్ణురస్తు తవసస్తవీయాన్
త్వేషం హ్యస్య స్థవిరస్య నామ ॥ 3

టీక : ఏషః దేవః = ఈ దేవుడు; ఏతాం పృథివీం = ఈ పృథ్విని; మహిత్వా = గొప్పదానిని చేసి; త్రిః, విచక్రమే = మూడు విధములుగా ఆక్రమించెను; విష్ణుః = ఈవిష్ణువు; తవసః = వృద్ధులకన్న; తవీయాన్ = పెద్దవాడు; అస్య స్థవిరస్య = ఈ చలనము లేనివాని యొక్క; నామ = పేరు; హి - త్వేషం - అస్తు = మిక్కిలి తేజోవంత మగుగాక:

తాత్పర్యము : ఈ విష్ణు దేవుడే ఈ భూమిని పెంచి పెద్దచేసి మూడు విధములుగా ఆక్రమించెను. ఈ పురాణ పురుషుడు మన వృద్ధుల కన్న పెద్దవాడు. ఈ శాశ్వత నిశ్చల మూర్తి పేరు మా ధ్యానము నందు తేజోవంత మగుగాక!

వివరణము : ఈ వేద మంత్రములు దర్శించిన వశిష్ఠాది ఋషుల కాలమునకే విష్ణువను మంత్రము చాల పురాతనమని దీని వలన తెలియు చున్నది. 'స్థవిష్ఠం, స్థవిరః, స్థాణుః, అచలః, స్థిరః, పురాణః' అను పదములతో భీష్మాదులు విష్ణువును కీర్తించుటకీ మంత్రములు ప్రమాణములు. పాండురంగ మాహాత్మ్యమున తెనాలి రామకృష్ణ కవి విష్ణుతత్త్వమును వివరించుచు "భవన ఘటనకు మొదలి కంబమున బోలి" అనియు, "వెలయు ప్రాయంబుగల కొయ్య విఠలయ్య" అనియు వర్ణించుటకీ సూక్తములే ప్రమాణములు.

వి చక్రమే పృథివీమేష ఏతాం
క్షేత్రాయ విష్ణు ర్మనుషే దశస్యన్ ।
ధ్రువాసో అస్య కీరయో జనాస
ఉరుక్షితిం సుజనిమా చకార ॥ 4

టీక : విష్ణుః = ఈ విష్ణువు; ఏతాం పృథివీం = ఈ పృథ్విని;

విచక్రమే = విశేషముగా ఆక్రమించెను; క్షేత్రియ = సాగుబడి చేయుట కొరకు; మనుషే = మనువు సంతతికొరకు; దశస్యన్ = పది వైపులుగా నేర్పరచుచు; అస్య = ఇతని యొక్క; జనాసః = జనులు; కీరయః = సంకీర్ణముగా (చిలుకలవలె) నున్నవారు; ధ్రువాసః = ఒక కేంద్రమున (చిలుకలు పండ్ల చెట్టుపై జేరినట్లు) చేరుచున్నారు; ఉరుక్షితిమ్ = పెద్ద దైన ఈ భూమిని (భూమియందు లయ మగుటను); సుజనిమ్ = చక్కని జన్మమును; ఆచకార = సాంతముగా నిర్మాణము చేసెను.

తాత్పర్యము : ఈ విష్ణువు ఈ పృథివి నాక్రమించిన విశేష క్రమము తెలియ దగినది. మానవులు సాగుబడి చేసి పండించు కొనుటకు దశ దిశలను కల్పించెను. తన నుండి పుట్టిన జీవు లెవరికివారు చిలుకల వలె నెగురు చుందురు. తన స్మరణ యందు ఒకే చెట్టు నీడను చేరి నట్లుందురు. వ్యక్తిగతముగా జీవించుటకు విశాలమైనపృథ్విగా నున్నాడు. ఏకత్వము నభ్యసించుటకు క్షితిగా నున్నాడు. ఉండుట ప్రారంభించుటకు చక్కని నర జన్మము నిచ్చెను.

వివరణము : క్షితి అనగా క్షీణము. క్షయమగుట లేక మృత్యువు. దేహములు మట్టిలో గలియుట వలన జీవులు ఏకత్వ మభ్యసించి, ఆ విష్ణు మయ సంస్కారముతో మరల జన్మించు చున్నారు. ఈ విధముగా విష్ణువు జననము, ఆయువు, మరణము అను మూడు పాదములతో గూడ విశేషముగా ఆక్రమించుచున్నాడు.

కీరము లనగా వెదజల్లబడిన కిరణములని గూడ అర్థము. సూర్యుని కిరణములు జీవుల జననాదులకు కారణమై భూమియందు పగటి వేళను పుట్టించు చున్నవనియు, క్షితి యగు భూమి దేహాంతమైన మృత్యువు నకు కారణమై రాత్రిని పుట్టించు చున్నదనియు అర్థము. అట్టి భూమిపై

నున్న జీవులన్నియు విష్ణువు నందు ధ్రువత్వము చెందుచున్న వనుటచే భూమి యందలి పరిభ్రమణ శక్తిగా ధ్రువముల యందు నిహితమై విష్ణు ధ్రువునకు ప్రసన్నుడైన కథకు మూల మిందున్నది. విష్ణు పదమను తన పరమ పదమును విష్ణువు ధ్రువునకు స్థానముగా ననుగ్రహించెనని పురాణములు కల్పన చేసినవి.

ప్ర తత్ తే అద్య శిపివిష్ట నామా
ఉర్యః శంసామి వయునాని విద్వాన్ ।
తం త్వా గృణామి తవస మతవ్యాన్
క్షయంతమస్య రజసః పరాకే ॥ 5

టీక : విద్వాన్ = ఓ సర్వజ్ఞుడా : ; తే = నీ యొక్క; నామ + అర్థః = పేరున కర్థము; శిపివిష్ట + ఇతి = యజ్ఞమున ప్రవేశించిన వాడని; అద్య = ఈ దినమున; వయునాని = స్తోత్రములను; ప్రశంశామి = ప్రశంసించెదను; తం త్వా = అట్టి నిన్ను; తవసం = మహనీయుని; అతవ్యాన్ = హీన లక్షణములను; క్షయంతం = క్షీణింప జేయుచున్న వానినిగా; అస్య రజసః = ఈ రజస్సులకు : పరాకే = పరమైన స్థానము నందు; గృణామి = గ్రహించు చున్నాను.

తాత్పర్యము : సర్వజ్ఞుడవైన ఓ విష్ణుదేవా ! నీ పేరునకు అర్థము యజ్ఞము నందు అంతర్యామియని గ్రహించు చున్నాను. గ్రహించి, చక్కని స్తోత్రములతో ప్రశంసించు చున్నాను. నీవు రజస్సులకు పరమైన లోకమున దూరముగా వెలుగు చున్నావు. కనుక హీన గుణములను క్షయ మొనరింతువని ఎరిగి నిన్ను ఆశ్రయించు చున్నాను.

వివరణము : తనకు ప్రయోజనము నాశింపక చేయునట్టి సత్క

ర్మను యజ్ఞమందురు. అట్టి మొదటి యజ్ఞమైన సృష్టి కర్మను ఆచరించు చున్నవాడగు అంతర్యామి, తానా స్థితిలోనికి దిగి వచ్చుటలో రజో లోకము లంటుకొనునని సంకోచ పడుటలేదు. అత డెల్లప్పుడును అణుమయాది లోకములకును రజో గుణాదులకును, అంతర్యామియై వాని కందని వాడై వెలుగొందు చున్నాడు. దేహధారి యగు మానవుడు వాని అంతర్యామిత్వ మును ధ్యానము చేసినచో రజస్సులకు పరమైన విష్ణు లోకమునే పొందు చున్నాడు. సృష్టిలో నుండియు సృష్టి కతీతు డగుచున్నాడు.

గాయత్రీ మంత్రమునకు అధిదేవత పరమాత్మయగు విష్ణువు. గాయత్రీ మంత్రము గాయత్రీ ఛందస్సులో దర్శింపబడినది కనుక మూడు పాదములు గలది. ఆ పాదములు మూడును భూర్భువస్స్వర్లోకము లనబడు లోకములకు సంకేతములు. వానిపైన నాలుగవ పాదమున్నది. అది గాయత్రీ మంత్రముననే అంతర్యామియై యున్నది. దాని పేరు పరో రజము. "పరో రజసే సావద" అను గాయత్రీ పాదముగా దీనిని శత పథ బ్రాహ్మణమున బృహదారణ్య కాండయందు ఋషులు దర్శించిరి. దానికి మూలము ఈ విష్ణు మంత్రమున నున్నది.

కిమిత్ తే విష్ణో పరిచక్ష్యం భూత్
ప్రయ ద్వవక్షే శిపివిష్టో అస్మి ।
మా వర్పో అస్మదప గూహ ఏత
ద్యదన్యరూపః సమిథే బభూథ ॥ 6

టీక : కిమిత్ = ఒకానొక విధముగా; విష్ణో = ఓ విష్ణు దేవా! తే = నీయొక్క; పరిచక్ష్యం = నా మోచ్చారణమును (పరిశీలించు చక్షువును); యత్ = ఏ విధముగా; ప్రవవక్షే = పలుక దలచుచున్నానో;

(దానిని) శిపివిష్టః = శిపివిష్టుడని; అస్మి = ఉన్నాను (పలుకుచున్నాను); మా = నాకు; ఏతత్ = ఈ రూపము; అస్మత్ + అపగూహ = దీని నుండి మాటుపడి; యత్ + అన్యరూపః = ఇతర రూపమేది కలదో; సమిథే = యుద్ధము నందు; బభూథ = సంభవించెను.

తాత్పర్యము : ఓ విష్ణుదేవా! నేను నీ నామమును పరికించి పలుక దలచితివి. శిపివిష్టుడను అర్థమే నీ నామముగా స్మరించెదను. (శిపివిష్టుడను పేరునుగూడ విష్ణువునకు పర్యాయ పదముగనే పలికెదను). అంతర్యామి యను నీ యర్థము మాటుపడినచో మా కితర రూపములు కనిపించును. అప్పుడు మాత్రమే శత్రువులు కనిపింతురు, కలహములు కలుగును.

వివరణము : సృష్టిలోని అన్ని వస్తువుల యందును, పదముల యందును, అర్థము లందును ఒకే అంతర్యామిని భావన చేయువానికి సృష్టి యంతయు నొకే యజ్ఞము. అట్టి వానికి శత్రువులు గాని, కలహములు గాని యుండవు.

ఉపమన్యుడు ఈ మంత్రమును వశిష్ఠ విశ్వామిత్రుల యుద్ధము సందర్భముగా వివరించెను. ఈ మంత్రమునకు ద్రష్ట వశిష్ఠుడు కనుక ఈ సందర్భము జరిగి యుండవచ్చును. ఆ సమన్వయ మిట్లున్నది : యుద్ధమునందు విష్ణువు ప్రచ్ఛన్నరూపుడై వశిష్ఠునకు సహాయము చేసెను. దానిని చూచి వశిష్ఠుడు ఈ విధముగా పలికెను : "ఏమి నీ విట్లుంటివి ? ఈ నీ రూపమేమి ? నీవు నీ కిరణములను మాటు పరచుకొని ఇచ్చట నాకు సహాయుడవై వర్తించుచున్నావు. ఇట్లు వర్తించుట నీకు క్రీడ. అది మహానుభావుల లక్షణము. కాని నీవీ యుద్ధమున కిరణములను తొలగించుకొని అంధుని రూపమున తిరుగుచున్నావు. (క్రోధాంధుడవై

మెలగుచున్నావు.) మానవుల యుద్ధమునకు దిగి వచ్చిన ఈ నీ రూపము నీ అసలు రూపమును మాటు పరచుచున్నది." (వశిష్ఠుని కుమారులలో నొకడు విశ్వామిత్రునితో యుద్ధమున గుడ్డివాడై తిరిగి రాగా, వశిష్ఠుడీ మంత్రముతో వానిని సంబోధించి, మరల విష్ణు ప్రసాదమున దృష్టిని అనుగ్రహించెనని పూర్వగాథ.)

వషట్ తే విష్ణవాస ఆ కృణోమి
తన్మే జుషస్వ శిపివిష్ట హవ్యమ్ ।
వర్ధంతు త్వా సుష్టుతయో గిరో మే
యూయం పాత స్వస్తిభిస్సదా నః ॥ 7

టీక : దీనికి టీకా తాత్పర్య వివరణము "పరో మాత్రయా" అను సూక్తమున (7-99 చివరి మంత్రమున వ్రాయబడినవి.)

## విష్ణు సూక్తములు — ౩

[ ఋగ్వేదము : మం — 1; సూ — 154; ఛందస్సు - త్రిష్టుప్;
ఋషి : మైత్రావరుణుడగు వశిష్ఠుడు ]

విష్ణోర్ను కం వీర్యాణి ప్ర వోచం
యః పార్థివాని విమమే రజాంసి ।
యో అస్కభాయదు త్తరం సధస్థం
విచక్రమాణ స్త్రేధోరుగాయః ॥ 1

టీక : విష్ణో = విష్ణువు యొక్క; వీర్యాణి = వీర కార్యములను; కంను = కొన్నిటిని; ప్రవోచమ్ = పలుకుచున్నాను; యః = ఎవడు ;

పార్థివాని = పృథివీ తత్త్వమునకు సంబంధించినవి అగు; రజాంసి = రజస్సులను; విమమే = నిర్మాణము చేసెనో; యః = ఎవడు; ఉత్తరం = ఊర్ధ్వమార్గముగల దానిని; సధస్థమ్ = నివాస స్థానముగా చేయబడిన దానిని; త్రేధా = మూడు విధములుగా; అస్తభాయత్ = స్తంభముగా నేర్పరచి; ఉరుగాయః = వేగవంతములైన గమనములు గానములుగా గలవాడయ్యెనో!

తాత్పర్యము : విష్ణువు యొక్క పరాక్రమములను ఒక కొన్నిటిని గూర్చి పలుకుచున్నాను. అతడు పృథివీ తత్త్వమును కల్పించి అణువుల పరమాణువుల రూపమున రజస్సులను నిర్మాణము చేసెను. ఉత్తరోత్తరము సూక్ష్మ సూక్ష్మములైన లోకముల మార్గము గల తన వెలుగును తానే మూడు విధములుగా ఆక్రమించెను. దానినే తన నివాసమైన స్తంభముగా నేర్పరచి లోకము లన్నిటికిని పోటీగా నిలబెట్టెను. తన వేగవంతములైన గమనములను కూర్పు చేసి వానినే తన గానములుగా పాడుకొనుచు వినుచున్నాడు.

వివరణము : వీర్యము లనగా పరాక్రమములే గాక, లోకముల సృష్టికి కారణములైన శుక్రముల వంటివి. రజస్సులనగా రజో గుణమున నుద్భవించిన అణువులు, పరమాణువులు, అందలి అంతర్భాగములు. అవి వేగవంతములైన శక్తుల జాడల వలన నేర్పడును. ఈ శక్తులు తేజోరూపములైన ప్రజ్ఞలనుండి ఉద్భవించును. ఇట్లు తేజస్సులు, శక్తులు, అణువులు అనునవి విష్ణువు యొక్క మూడు విధములైన ఆక్రమణములు లేక అంతర్యామిత్వములు. వీనినే భూః భువః సువః అనబడు మూడు లోకము లందురు. అందు సువర్లోకమైన తేజో లోకమున పంద్రెండుగురు ఆదిత్యులను, భువర్లోకమైన శక్తి లోకమున ఏకాదశ రుద్రులను, భూలోకమైన అణులోకమున ఎనిమిదిమంది వసువులను

దేవతలై పనిచేయుచుందురు. ఈ మూడు లోకములుగా విష్ణువు అంత ర్యామిత్వము లోనికి దిగివచ్చును. అదియే మూడడుగులలో ఆక్రమించె నని పురాణములలో బలిచక్రవర్తి కథయందు వర్ణింపబడినది.

భూగోళమున నిలబడిన మానవునకు మీది వైపునకు సూక్ష్మ లోకములు అల్లబడి ఉన్నవి గనుకను, భూగోళము నుండి సూర్య గోళము వైపునకు అల్లబడి యున్నవి గనుకను, ఈ లోకముల వరుసను ఊర్ధ్వ గతి లేక ఉత్తర మార్గము అందురు.

ఇందు శక్తుల నుండి వేగములు పుట్టి గ్రహ వేగములుగా, గ్రహ కక్ష్యలుగా నేర్పడు చున్నవి. కనుక వాని సంవత్సరాదుల కొలతలే అతని గానములుగా చెప్పబడినవి. వాని వలననే మన శ్వాసలు, కంఠ నాదములు నేర్పడు చున్నవి. కనుక అతడు గానము చేయుచున్నాడని చెప్పబడినది.

ప్ర తద్విష్ణుః స్తవతే వీర్యేణ
మృగో న భీమః కుచరో గిరిష్ఠాః ।
యస్యోరుషు త్రిషు విక్రమణే
ష్వధిక్షియంతి భువనాని విశ్వా ॥ 2

టీక : తత్ = ఆ కారణముచేత; విష్ణుః = విష్ణువు; ప్రస్తవతే = స్తుతింప బడుచున్నాడు; వీర్యేన = పరాక్రమముచేత; మృగః = వెదుక తగినవాడు; న భీమః = భయంకరుడు మాత్రము కాడు. కుచరః = వక్రముగా చరించువాడు; గిరిష్ఠాః = పర్వతమునందు మృగము దాగి యున్నట్లు వాక్కునందు దాగి ఉన్నవాడు; యస్య = ఎవనియొక్క; ఉరుషు = వేగవంతములైన; త్రిషు విక్రమణేషు = మూడు విక్రమముల

యందును; విశ్వా భువనాని = ఈ సమస్త లోకములను; అధిక్షియంతి = అధివసించి యుండి, లీనమగు చున్నవో.

తాత్పర్యము : ఈ విష్ణువు మృగమువలె పరాక్రమముచే వెదుకబడువాడు. వక్రిమార్గమున చరించుచున్నను. భయంకరుడు మాత్రము కాడు. పర్వతమున గుహలో మృగము దాగి ఉన్నట్లు అతడు మన వాక్కునందే దాగి యుండును. అతని వేగరూపములైన త్రివిధ పరాక్రమముల యందును ఈ సమస్త లోకములును ఉద్భవించి లయమగు చున్నవి. అట్టి విష్ణువు మాచే స్తుతింపబడు చున్నాడు.

వివరణము : మృగమనగా వెదుకబడునది అని అర్థము. వేటాడువారు మృగములను వెదకుదురు గనుక ఈ పదమున కర్థ మిట్లేర్పడినది. సంవత్సర దేవతయైన ప్రజాపతి మృగ రూపము ధరించి గ్రహగతుల వెంట పరుగెత్తు చున్నట్లు వేదములయందు ఇతిహాసము. విష్ణువే సంవత్సం స్వరూపుడై మన వాక్కుల యందు పరమార్థముగా అంతర్యామిత్వము చెందెననియు. సంవత్సర స్వరూపుడై ప్రజాపతిగా వర్తించుచు గాయత్రిగ వాగ్రూపము చెందెననియు. వాక్కును భయంకరముగా వాడక సౌమ్యముగా, నితరులకు తృప్తికరముగా ప్రయోగించినచో విష్ణువే స్తుతింప బడుననియు అర్థము. మొదటి మంత్రములోని స్తంభము, రెండవ మంత్రములోని మృగము అను కల్పనలే ఇతిహాస పురాణములలో స్తంభమున నృసింహుడు పుట్టిన కథగా దర్శింప బడినవి. (ఇందు విష్ణుని నృసింహ వామనావతారముల కథలకు మూల మెచ్చట నున్నదో గమనించ వచ్చును.) వక్ర మార్గమున అతడు గమనము చేయునని చెప్పుట ఎందుల కనగా. గ్రహములు తిరుగు కక్ష్యలు మండలాకారములేగాని సరళ రేఖలుగావు. గ్రహముల ఆకారములు గూడ గోళములే గాని చతురస్రాది రూపములు గావు.

ప్ర విష్ణవే శూషమేతు మన్మ
గిరిక్షిత ఉరుగాయాయ వృష్ణే ।
య ఇదం దీర్ఘం ప్రయతం సధస్థ
మేకో విమమే త్రిభిరిత్ పదేభిః ॥ 3

టీక : విష్ణవే = విష్ణువు కొరకు; గిరిక్షితే = వాక్కునందు లీనమై ఉండువాని కొరకు; ఉరుగాయాయ = వేగముతో గానములుగా గల వాని కొరకు; వృష్ణే = వర్షించు వాని కొరకు; మన్మ = మననము చేయు చున్నాను; యః = ఎవడు; ఇదం దీర్ఘం = ఈ దీర్ఘమైన; ప్రయతమ్ = ప్రయత్నమును; సదస్థమ్ = నివాసమున నివసించు స్థితిని; ఏకః = తా నొక్కడే; త్రిభిః పదేభిః = మూడడుగులచే; ఇత్ విమమే = నిర్మాణము చేసెనో అతడు; శూశమ్ + ప్ర + ఏతు = బలమును కలిగించు స్థితిని పొందుగాక :

తాత్పర్యము : వాక్కుల యందు లీనమై, తన వేగముతో గాన ములై వర్షించు నట్టి స్వభావమే సంపదయై చరించు విష్ణువును గూర్చి మేము మననము చేయుచున్నాము. ఈ లోకములకు స్థితిని గూర్చు దీర్ఘ ప్రయత్నమున అత డొక్కడే ఈ విధముగా తన మూడడుగులతో సమస్తమును నిర్మాణము చేసెను. అట్టి విష్ణువు తన్ను స్మరించిన వారికి బలమును చేకూర్చుగాక !

వివరణము : వృష్ణి అను పదమునకు వర్షించు స్వభావము కల వాడని అర్థము. ప్రజాపతి అయిన సంవత్సర మూర్తి దేహమున వక్ష స్థలము నందు వర్ష ఋతువు స్వరూపమున మేఘాధిపతి యగు ఇంద్రుడను దేవత వర్తించును. దీని నుండియే సంపద కధిదేవత అయిన లక్ష్మీదేవి విష్ణువు వక్షస్థలము నుండి యుద్భవించె ననియు, ఇతర ఋతువుల

యందు ఇంద్రుని సంపదతోపాటు ఆమెయు మాయమై, మరల వర్ష ఋతువున నుద్భవించు చుండెననియు కల్పింప బడినది. వర్ష ఋతువునకు సంక్రమణ స్థానమైన కర్కాటక రాశి కాలపురుషుని వక్షస్థలమని జ్యోతిర్విదులు దర్శించిరి.

వృష్ణి అను పదము విష్ణుని అవతారమగు కృష్ణుడుగా పురాణములలో అన్వయింప బడినపుడు వృష్ణి వంశము వాడు. వార్ష్ణేయుడు అని చెప్పబడినది.

యస్య త్రీ పూర్ణా మధునా పదా
వ్యక్షీయమాణా స్వధయా మదంతి ।
య ఉ త్రిధాతు పృథివీముత ద్యా
మేకో దాధార భువనాని విశ్వా ॥ 4

టీక : యస్య = ఎవనికి; త్రీ = మూడు; పూర్ణాః = సంపూర్ణములైన; పదాని = అడుగులు; అక్షీయమాణా = క్షీణత్వము లేక వర్ధిల్లుచున్నవై ; స్వధయా = తన్ను తాను ధరించుకొను శక్తి చేత (ఆహారము చేత); మధునా = రుచికరమైన దానిచేత; మదంతి = సంతుష్టి చెందుచున్నవో: యః + ఉ = ఎవడైతే; త్రిధాతు = మూడు విధములుగా మూడు ధాతువులుగా; పృథివీం = పృథివీ తత్త్వమును; ద్యాం = దివమును; విశ్వా భువనాని = సర్వ లోకములను; ఏకః = ఒక్కడే; దాధార = ధరించెనో.

తాత్పర్యము : ఎవని యొక్క పరిపూర్ణములైన మూడడుగుల కొలతలు. స్వధ యనబడు ఆహార నిర్మాణము చేత అక్షయములై, రుచికరములై సంతుష్టి ననుభవింప జేయుచున్నవో అట్టి విష్ణువును స్మరించు

చున్నాము. ఎవని మూడడుగులు పృథివిని, దేవ లోకమును, ధరించు చున్నవో అట్టి విష్ణువును నుతించు చున్నాము. ఎవ్వడు ఈ సర్వ లోకములను ఒక్కడే ధరించి యున్నాడో అట్టి వానిని మననము చేయుచున్నాము.

వివరణము : స్వధ యనగా తన్ను తాను ధరించి పోషించుకొను శక్తి. ఇది పితృదేవతలకు ఆహారముగా చెప్పబడినది. పితృ దేవతల సత్కర్మల వలన జలములు ఉత్తరాయణమున భూమి నుండి ఆవిరులై లేచి, దక్షిణాయనమున మేఘములై వర్షముగా దిగివచ్చును. తత్ఫలిత ముగా భూమిపై బీజాంకుర శక్తులు పనిచేసి ఆహారోత్పత్తి జరుగును. వృక్షములకు, జంతువులకు, మానవులకు దేహములు కల్పింపబడుట ఈ వర్షించు శక్తి వలనను, బీజాంకుర శక్తి వలనను కలుగుచున్నవి. దానితో శరీరములు జీవులకు పరస్పరము ఆహారములుగా సంసిద్ధ మగును. ఈ సత్కర్మనే పితృ కర్మ యందురు. వృక్షముల జంతువుల దేహములు ఈ కర్మ వలన ఆహారత్వము పొందుటకు రుచియనునది పితృ దేవతలచే అర్పింపబడినది. ఈ విధమైన పితృ యజ్ఞ మంతయు దివము, పృథివి, అంతరిక్షము అను సృష్టి విభాగముగా నేర్పడుటయే విష్ణువు మూడడు గులతో సంపూర్ణముగా దిగి వచ్చుట. దీనికి ఫలము మదము లేక ఆకలికి సంతుష్టి. ఈ మూడు లోకముల విభాగమే అంతర్యామి యొక్క మూడు ధాతువులుగా సృష్టి పుట్టును.

తదస్య ప్రియమభి పాథో అశ్యాం
నరో యత్ర దేవయవో మదంతి ।
ఉరుక్రమస్య స హి బంధురిత్థా
విష్ణోః పదే పరమే మధ్వ ఉత్సః ॥ 5

టీక : తత్ = ఆ కారణముచే; అస్య = వీనికి; అభిప్రియమ్ = అభిముఖముగా ప్రియమై; పాథః = జలములు; అశ్యాం = ఆస్వాదించుట యందు; నరః = నరుడు; యత్ర = ఎవనియందు. దేవయవః = దేవతల కిష్టుడై; మదంతి = సంతుష్టిని చెందునో; ఉరుక్రమస్య = వేగ వంతములైన; విశాలములైన అంగలు కలవానికి; సహ + హి = అతడే; బంధుః = సంబంధించిన వాడై, ఇత్థా = ఈ విధముగా; విష్ణోః = విష్ణువు యొక్క; పరమే పదే = పరమ పదమునందు (ఉత్తమ మార్గము నందు) మధ్వః = మధువులు; ఉత్సః = ఉత్పత్తి స్థానము లగుచున్నవో.

తాత్పర్యము : ఈ పితృదేవతల స్వధారూపమైన సత్కర్మ వలన జలములు అభిముఖత్వము చెందుచున్నవి. ప్రియముగా ఆస్వాదింపబడు చున్నవి. నరులు దేవతల కిష్టులై సంతోషించు చున్నారు. అట్టి నరులే పెద్ద పెద్ద అడుగులతో దిగివచ్చు విష్ణువునందు బంధించుకొని బంధువు లగుచున్నారు. అటువైన విష్ణుని పరమపదమునందు మాధుర్యము నాస్వాదించి ఊర్ధ్వ మార్గమును పట్టుచున్నారు.

వివరణము : భూమిపై జలముల ఉత్తర దక్షిణాయన గతుల వలన జీవులు ఆహారము యొక్క రుచిని ఆస్వాదించు చున్నారు. జల ధాతువు వలననే ఆహారమునకు రుచులు పుట్టు చున్నవి. మిగిలిన ఆకులు. కాయలు. దుంపలు, మాంసము మున్నగు ఆహార పదార్థము లన్నియు పృథివి యందలి రసాయనిక పదార్థములే. వానియందు రుచిలేదు. జలముల బీజాంకురత్వాదుల వలన రుచి యేర్పడుచున్నది. కనుక జనులు జలములనే మధువులుగా గ్రోలుచున్నారు.

అంతర్యామియైన విష్ణువే ఇన్ని రూపములుగా దిగివచ్చు చున్నాడు గనుక జీవు లందరును రుచులచే బంధింపబడి విష్ణునితో సంబంధము

గల వారై నారు. ఈ రుచు లనుభవించిన వెనుక సత్కర్మల బలమున యోగ మార్గము పట్టి భక్తి, జ్ఞానము లలవడి, సూటిగా అంతర్యామిత్వము నందలి రుచిని గ్రహించుచున్నారు. అదియే పరమపదము. ఇట్లు సోపాన క్రమమున ఆరోహించుటయే ఊర్ధ్వగతి. ఈ మంత్రి మందలి సోపాన క్రమమున మిగిలిన మంత్రములలో ఏడు కక్ష్యలు వర్ణింపబడినవి. కనుక ఏడుకొండలవాడు అనబడు వేంకటేశ్వరుని రూపమున కీ మంత్రము మూలముగా స్వీకరింపబడినది.

"విష్ణోః 'పదే పరమ' ఇత్యుదిత ప్రశంసౌ
యౌ 'మధ్వ ఉత్స' యితి భోగ్యతయాప్యుపాత్తౌ"

అను వేంకటేశ్వర ప్రపత్తి శ్లోకమున ఈ యంశము ప్రతిపాదింపబడినది.

తా వాం వాస్తూన్యుశ్మసి గమధ్యై
యత్ర గావో భూరిశృంగా అయాసః
అత్రాహ తదురుగాయస్య వృష్ణః
పరమం పదమవభాతి భూరి ॥ 6

టీక : తా = అవి; వాం = మీకు; వాస్తూని = నివాస స్థానములుగా; ఉశ్మసి = వసతి చేయుచుంటివి; గమధ్యై = దానిని అధిగమించుటను కోరుచున్నాము; యత్ర = ఎచ్చట; గావః = గోవులు (కిరణములు); భూరిశృంగాః = పెరిగినకొమ్ములతో (విచ్చుకొనినరంగులకిరణములతో); అయాసః = ప్రయాణము చేయుచున్నవో; అత్రాహ = ఇచ్చటనే; తత్ + ఉరుగాయస్య = ఆ వేగ గమనముగల వాని యొక్క; వృష్ణః = వర్షించుచున్న విష్ణువు యొక్క; పరమం పదమివ = పరమ పదముగా; భూరి = విస్తారముగా; భాతి = ప్రకాశించును.

తాత్పర్యము : ఆ విష్ణువుయం దుద్భవించిన స్థానమును విష్ణు లోకమైన నివాసముగా చేసికొని జీవులు స్థితిని పొందుచున్నారు. అచ్చట పెద్ద కొమ్ములుగల గోవులు తిరుగుచున్నట్లు అనేక చిత్ర వర్ణములతో కూడిన కిరణములు సంచరించు చుండును. అదియే కిరణములను వర్షించు నట్టి వేగవంతములైన దారులుగల పరమపదము. దాని ప్రకాశము తరుగనిది.

వివరణము : విష్ణులోకమునందే సర్వలోకములును. జీవులును. అస్తిత్వము చెందుచున్నారు. విష్ణువు స్థితి కధిదేవత. విష్ణుశబ్దమునకు సర్వవ్యాపియని అర్థము. ఒక లోకమునుండి ఇంకొక లోకము పుట్టు చున్న భేదమే కిరణములు. అన్ని లోకములలో గల అంతర్యామిత్వమే ప్రకాశము. దానికి కిరణము లుండవు. లేక భేదము వలన కిరణములు పుట్టును. మబ్బులపై పడిన సూర్య తేజస్సు ఇంద్ర ధనుస్సులుగా నేర్పడినట్లు లోకముల భేదము లేర్పడును. దాని వలన జీవులకు స్థితి సాధ్యమగును. లోకములే లేనిచో అంతర్యామి యుండునుగాని జీవు లుండరు. ఈ జీవులకు లోకములకు వానిలోని అంతర్యామిత్వమే పరమపదము. అది ఈ జీవుల లోకములవలె వచ్చుచు పోవుచుండుట నెరుగనిది. కనుకనే తరుగనిది లేక అవ్యయము.

## విష్ణు సూక్తము లు – ౨

[ ఋగ్వేదము . మం – 1; సూ – 156; ఛందస్సు – జగతీ
ఋషి – దీర్ఘతమసుడగు ఔచథ్యుడు ]

భవా మిత్రో న శేవ్యో ఘృతాసుతి
ర్విభూతద్యుమ్న ఏవయా ఉ సప్రథాః ।

అథా తే విష్ణో విదుషా చిదర్ధ్యః
స్తోమో యజ్ఞశ్చ రాధ్యో హవిష్మతా ॥ 1

టీక : విష్ణో = ఓ విష్ణు దేవా! ఘృతా సుతిః = నేతిని సోమరస ముగా స్వీకరించినవాడవై ; నశేవ్యః = నాశము కలుగనీయకుండ; మిత్రిః భవ = మిత్రుడ వగుము; యాః = ఏవి ఏవి; నప్రిథాః = ప్రసం గింప బడినవో; (అట్టి) విభూతద్యుమ్న = వైభవములను వెలుగులుగా పొందుము; హవిష్మతా = హవిస్సు కలిగిన; యజ్ఞః = యజ్ఞ స్వరూపు డవై ; రాధ్యః చ = ఆరాధనీయుడవై ; స్తోమః = స్తోత్ర స్వరూపుడవై; విదుషాంచిత్ = విద్వాంసులకు; అర్ధ్యః = అర్థింప దగినవాడవై.

తాత్పర్యము : హవ్యమైన ఈ ఘృతమును సోమముగా గొనిన వాడవై మా స్తోత్రముల నందుకొనిన వాడవై నాశము లేకుండునట్లు రక్షింపుము. ప్రస్తావింపబడిన సంపదలను మా కోరికలుగా గ్రహించి నీ అగ్ని జ్వాలల కిరణములుగా వెలిగించి కార్యసిద్ధిని ప్రసాదింపుము. హవిస్సు నిచ్చువారిచే ఆరాధ్యుడవై, స్తోత్రములు చేయువారిచే నుతింపబడు వాడవై, విద్వాంసుల వాక్కుల అర్థము రూపమున మమ్మనుగ్రహింపుము.

వివరణము : ఇది యజ్ఞమునందు ఘృతమును హవిస్సుగా సమర్పించుచు పఠింప వలసిన మంత్రము. మిత్రుడనగా కొలతల కధి దేవత యని కూడ అర్థము.

యః పూర్వ్యాయ వేధసే నవీయసే
సుమజ్జానయే విష్ణవే దదాశతి ।
యో జాతమస్య మహతో మహి బ్రవత్
సేదు శ్రవోభిర్యుజ్యం చిదభ్యసత్ ॥ 2

టీక : యః = ఎవడు; వేధసే = బ్రహ్మకును; పూర్వ్యాయ = పూర్వుడైన వానికి; నవీయసే = క్రొత్త వానికి; సుమత్ + జానయే = సుమ్నము లనబడు స్తోత్రములచే తెలియబడువానికి; విష్ణవే = విష్ణువనకే; దదాశతి = శత్రువులను చీల్చువానికి; యః = ఎవడు; జాతం = పుట్టిన వానిని; అస్య = ఇతనికి; మహతః + మహి = పెద్దవారిలో పెద్ద వానికి; బ్రవత్ = పలికెను; స ఇత్ = అతడు; శ్రవోభిః = చెవుల చేత; యుజ్యం చిత్ = జోడింపదగిన దానిని; అభి + అసత్ = అభిముఖముగా అస్తిత్వము చెందెను.

తాత్పర్యము : ఎవడు సృష్టికర్త యగు బ్రహ్మకన్న పూర్వుడో, ఎప్పటి కప్పుడు నూతన శిశువై ఎవడు పుట్టుచున్నాడో, సుమ్నము లనబడు స్తోత్రములచే నెవడు తెలియబడుచున్నాడో అట్టి విష్ణువునకు హవిస్సులను సమర్పణ చేసినవాడు సార్థకమైన శ్రవణేంద్రియములు కలవాడై అతని అస్తిత్వమును గూర్చి పలుక గలడు. అతడు యజ్ఞములతో విజయము పొందగలడు.

వివరణము : సుమ్నము లనగా భగవంతుని స్తోత్రరూపములైన వేద మంత్రములు. ఇవి సామ మార్గమున సంకీర్తనము చేయబడును. అందుఎక్కువ భాగములు తారస్థాయిలో నుండును. వాని యుచ్చారణమున వెలువడిన చక్కని కంఠ నాదమునే పిండబడిన సోమము అందురు. దాని యనుభూతిలో లయమగు ఆనంద స్థితియే సోమ పానముగా వర్ణింపబడినది. సుతి యనగా పిండుట. పిండ బడినవి గనుక వీనిని సుమ్నము లందురు.

తము స్తోతారః పూర్వ్యం యథావిద
ఋతస్య గర్భం జనుషా పిపర్తన ।

అన్య జానంతో నామచి ద్వి వక్తన
మహాస్తే విష్ణో సుమతిం భజామహే ॥ 3

టీక : తం + ఉ = అతనిని; యథావిదః = యథార్థమును తెలిసిన వారు; స్తోతారః = స్తోత్రము చేయువారు; పూర్వ్యం = అందరికిని పూర్వుడగు వానిని; ఋతస్య = అప్రయత్నోచ్చారణమైన సత్యమునకు; గర్భం జనుషాః = గర్భమును జనింప జేయువారై; పిపర్తన = సంఖ్యలుగా వృద్ధి జేసెను; అస్యచిత్ = ఇతని యొక్క; నామ = పేరును; జానంతః = తెలియుచున్నవారై; వివర్తన = విశేషముగా ప్రవచనము చేయుచున్నారు; విష్ణో = ఓ విష్ణుదేవా! తే మహః = నీ తేజస్సును, సుమతిం = మంచి మనస్సుగా; భజామహే = భజించు చున్నాము.

తాత్పర్యము : ఓ విష్ణు దేవా! నిన్ను స్తోత్రముచేయు రహస్యము లెరిగిన పూర్వులు నిన్ను పూర్వతరుడవైన ఋత స్వరూపుడవుగా స్తుతించిన వాక్కులు ఋతములు గర్భముగా ధరింప జేయును. అర్థముల సంతతిగా నుద్భవింపజేయును. పెద్దలు నీ పేరును అర్థము తెలిసి ఉచ్చరించి ప్రవచనము చేయుచున్నారు. మేమును మంచి మనస్సుతో నీ తేజస్సును భజించు చున్నాము.

వివరణము : ఋత మనగా అప్రయత్నముగా కంఠమునుండి పలుకబడు సత్యము. ఇది శబ్దార్థముల సమన్వయ రూపమున నుండదు. కంఠస్వరము రూపమున నుండును. దాని నుండి శ్వాస వెలువడును. అనగా దేహధారి తానే వాక్కుగా వెలువడు చున్నాడు. శ్వాస రూపముగా వాయువు వెలువడును. వాయువును ప్రత్యక్ష బ్రహ్మముగా తెలిసి పలుకుటయే ఋతము. దాని నర్థముగా భావన చేయుటే సత్యము. ఈ సృష్టిలో దేహధారులగు జీవులు కంఠధ్వని యందును, శ్వాస యందును, వాయువు

నందును. వాయువు చరించునట్టి ఆకాశ శరీరమైన బ్రహ్మము నందును సత్యము లగుచున్నారు. దీనిని భావన చేయుచు నుచ్చరించినచో అంత ర్యామియగు విష్ణుని భావనలో ప్రవేశింతురు. దాని కఠీనమైన మనస్సు పన్మనస్సుగా నుండును.

తమస్య రాజా వరుణ స్తమశ్వినా
క్రతుం సచంత మారుతస్య వేధసః ।
దాధార దక్షము త్తమ మహర్విదం
వ్రజంచ విష్ణుః సఖివా అపోర్ణుతే ॥ 4

టీక : తం = అతనిని; రాజా = రాజగు; వరుణః = వరుణుడు; అశ్వినా = గుర్రముగల వానిచేత; అస్య = ఇతని యొక్క; క్రతుం = యజ్ఞ కర్మను; సచంత = ఆచరించెను; వేధసః = బ్రహ్మయైన; మారుతస్య = మరుత్తునకు; దక్షం = దక్షుని; ఉత్తమం = గొప్పవానిని; అహర్విదం = అహస్సును తెలిసిన వానినిగా; దాధార = ధరించెను; విష్ణుః = విష్ణువు; సఖివాన్ = స్నేహము గలవాడై; వ్రజంచ = గోబృందమును గూడ; అపోర్ణుతే = ద్వారములను తెరచెను

తాత్పర్యము : ఆ విష్ణువునే యజ్ఞమూర్తిగా స్వీకరించి వరుణుడు రాజై యజ్ఞము చేసెను. అతడు విష్ణువును గుర్రము నెక్కిన వానినిగా దర్శించెను. మరియు మారుత రూపుడైన సృష్టికర్తగాకూడ దర్శించెను. ఆ విష్ణువు దక్షుని అహస్సు నెరిగిన వానినిగా నియమించెను. ఇట్లు స్మరింపబడిన విష్ణువు సఖుని రూపమున సంపదల ద్వారము తెరచెను.

వివరణము : వరుణుడు జలములకు అధిదేవత. అతడు విష్ణువును సంవత్సర స్వరూపుడైన యజ్ఞమూర్తిగా దర్శించి యజ్ఞము

చేసెను. అనగా భూమిపై జలములకు ఉత్తర దక్షిణాయనములను కల్పించి మేఘములను కూర్చి పృథ్వి జీవులకు బీజాంకుర శక్తిని, అన్నమును సంకల్పించెను. దానికి అగ్ని స్వరూపుడైన విష్ణుని సహాయము కావలెను. అది సూర్య స్వరూపుడైన విష్ణుని నుండి కిరణముల మార్గమున దిగివచ్చెను. దిగివచ్చి దేహములలో ప్రాణముగా మెలగుచు కదలించెను. విష్ణుని ఈ రూపమును అశ్వమందురు. వేదకవి సమయమున అశ్వమనగా ప్రాణాగ్ని. కనుక వరుణుడు శుక్ర స్వరూపుడై యజ్ఞము చేసి, విష్ణువును జీవిగా కల్పించుటకు గుర్రము నెక్కిన వానినిగా భజించెను. ప్రాణాగ్నియైన ఈ గుర్రము వరుణుని జలములతో ఉత్తర దక్షిణాయన మార్గమున ఋతు ధర్మములుగా సంవత్సర చక్రము రూపమున తిరుగుచున్నది.

అటుపైన వాయు స్వరూపుడైన విష్ణుని సహాయము కావలసి వచ్చెను. వాయువును శ్వాసగా నర్పించి, జీవుల జన్మకు సృష్టికర్తయైన బ్రహ్మగా దర్శించెను. ఇంతటితో సృష్టికర్మ పరిపూర్తియైనది. ఇక ప్రజా సర్గము **(Reproduction)** కావలసి యున్నది. అప్పుడు వరుణుడు ప్రార్థింపగా విష్ణువు యజ్ఞ స్వరూపుడై బ్రహ్మయందు దక్షుని కల్పించెను. దక్షుడనగా భూమ్యాకాశములను వేరుచేసిన సమర్థుడగు ప్రజాపతి. అతడు తన యజ్ఞమున స్థూల సూక్ష్మ లోకములను వేరుచేసి పృథివీ తత్త్వము నేర్పరచి దానితో భౌతిక శరీరములను కల్పించెను. అన్నమును సృష్టిచేసి. జీవుల దేహములయందు స్త్రీ పురుష భేదమును కల్పించెను. అనగా గర్భధారణము, ప్రసూతి అను యజ్ఞభాగములకు దక్షు డధిపతి. కనుకనే దక్షుని భార్యను ప్రసూతియని పేర్కొని మను పుత్రికగా ఇతిహాస పురాణవిదులు స్థాపించిరి. దక్షు డహంకారమునకును, ప్రసూతి దేహ జననమునకును అధిదేవతలు. దీనితో దేహధారులైన జీవులకు అన్నప్రాప్తి, భూవసతి, అశ్వములు, గోవులు మున్నగు సంపదలు,

కోరుట తీరుట, మున్నగు వానికి విష్ణువుచే యజ్ఞస్వరూపమైన ద్వారము తెరువ బడినది.

ఇందు గుఱ్ఱముపై తిరుగుచున్న అగ్నినే పర్జన్యమూర్తిగా కూడ వేద మంత్రములు గానము చేయుచున్నవి. భారతమున ఉదంకుని కథలో నాగ లోకమున నుదంకుడు దర్శించిన అశ్వమిదియే. దాని నధిష్ఠించిన వాడు ఇంద్ర సఖుడైన పర్జన్యుడు.

దక్షుడు అహస్సు నెఱిగిన వాడనగా అహోరాత్రముల విభజన నెరిగినవాడు. అందహస్సునుండి పురుష దేహములను, రాత్రమునుండి స్త్రీ దేహములను పుట్టించెను. సూర్యోదయము నుండి రెండు భాగములుగా జేయబడిన అహోరాత్రి విభాగమునందు ఉషస్సు పుట్టెను. ఇది జీవి యందు ప్రాణము మేల్కొనుటగా అశ్వరూపము దాల్చెను. "అహస్సు అశ్వము. ఉషస్సు మేధ్యమైన అశ్వము యొక్క శిరస్సు" అని శతపథ బ్రాహ్మణ మందలి అశ్వమేధకాండ ముపదేశించు చున్నది. ఈ భాగ మునే బృహదారణ్యకోపనిషత్తు అందురు.

ఇందలి ప్రాణాగ్ని రహస్యమునే పురాణములలో బడబ యనబడు గుఱ్ఱముగా దర్శించిరి. సూర్యుని భార్య భూమికి ఆడు గుఱ్ఱమై దిగి రాగా సూర్యుడు కూడ మగ గుఱ్ఱమై దిగివచ్చి విహరించెనని పురాణ కథ.

ఈ ప్రాణాగ్నినే గుఱ్ఱము శిరస్సుగల విష్ణుని అంతర్యామి ప్రజ్ఞగా నారాధించినచో విద్యా దర్శన మగును. దీనినే హయగ్రీవుని యవతారముగా పురాణేతిహాస మంత్ర తంత్ర శాస్త్ర గ్రంథములును స్థాపించినవి.

అయో వివాయ ¦సచథాయ దైవ్య
ఇంద్రాయ విష్ణుః సుకృతే సుకృత్తరః ।

వేధా అజిన్వత్ త్రిషధస్థ ఆర్య
మృతస్య భాగే యజమాన మా భజత్ ॥ 5

టీక : సుకృతే = సత్కర్మ లాచరించు వారికి; సుకృత్తరః = మించిన సత్కర్మ లాచరించువాడగు; విష్ణుః = విష్ణువు; ఇంద్రాయ = ఇంద్రుని కొరకు; సచథాయ = క్రమము నేర్పాటు చేయువాని కొరకు; విదాయ = విశేషముగా నిర్మాణము చేయువారి కొరకు; యః = ఎవడు; దైవ్యః = దివ్య స్వరూపుడై; అభజత్ = పరిపూర్ణముగా వర్తించెనో; వేధా = బ్రహ్మ; త్రిషధస్థః = మూడు స్థానము లందున్న వాడుగా; ఆర్యం = ఏ పెద్ద వానిని; అజిన్వత్ = అర్చించెనో; ఋతస్య భాగే = ఋత మనబడు అప్రయత్న సత్యము యొక్క భాగమునందు; యజమానః = యజ్ఞము చేయువాడు; అభజత్ = భజించెనో.

తాత్పర్యము : పుణ్య కర్మ లాచరించిన వారిలో నుత్తమ పుణ్య కర్మ నాచరించిన వాడుగా, దివ్యులలో దివ్యుడుగా అంతర్యామిత్వము నందిన విష్ణువు ఇంద్రుని కొరకు, వాని సృష్టి నిర్మాణ యజ్ఞము కొరకు. వాని ననుగ్రహించెను. సృష్టికర్త యగు బ్రహ్మ ఇతనిని మూడు స్థానముల యందు ఉన్న వానినిగా ఆర్యునిగా భజించెను. ఈ విష్ణువు ఋతము నందలి భాగమున యజమానుని భజించెను.

వివరణము : ఇంద్రుడు విష్ణువునే జీవుల ఇంద్రియముల కధిపతియైన మనస్సుగా దర్శించి, తానది యయ్యెను. సృష్టి కర్తయగు బ్రహ్మ ఈ విష్ణువునే జీవిగా గొనివచ్చుటలో మూడు స్థానముల యందు కనుగొనెను. అవి ద్రవ్యమయము, శక్తిమయము, తేజోమయము (ప్రజ్ఞామయము) అనబడు దేహ కోశములు. వానికై మొదట పృథివి, అంతరిక్షము, దివము అను వానిని సృష్టి చేసెను. దానితో జీవితమును

యజ్ఞముగా నాచరించు నట్టి యజమానుడై జీవుడు పుట్టెను. ఈ మూడు విధములైన యజ్ఞ కర్మలలో ఇంద్రుడు, బ్రహ్మ, యజమానుడు పాల్గొను చున్నారు. అనగా జీవుడు యజ్ఞార్థముగా జీవించినచో మిగిలిన ఇద్దరి యజ్ఞము నందును పాల్గొని అంతర్యామియైన విష్ణుని పరమపదము నను భవించును. దీనినే

"ధాతా పురస్తాత్ యముదాజ హార,
శక్రః ప్రవిద్వాన్ ప్రదిశ శ్చతస్రః"

అను పురుషసూక్త మంత్రము గూడ దర్శింప జేయుచున్నది.

## విష్ణు సూక్తములు – ౭

( ఋగ్వేదము. ఖిలకాండము. సూక్తము 28 - ఛందస్సు : అనుష్టుప్ )

యత్ర తత్పరమం పదం
విష్ణోర్లోకే మహీయతే ।
దేవైః సుకృత కర్మభి
స్తత్రి మా మమృతం కృధి ।
ఇంద్రా యేందో పరిస్రవ॥ 1

టీక : యత్ర = ఎక్కడ; విష్ణోః = విష్ణువు యొక్క; లోకే = లోకము నందు; సుకృత కర్మభిః = పుణ్య కర్మ లాచరించిన వారిచేత; దేవైః = దేవతల చేత; మహీయతే = భూమిగా చేయబడుచున్నదో (విస్తరింప జేయబడు చున్నదో. నివాస స్థానముగా చేయబడు చున్నదో); తత్ర = అక్కడ; మాం = నన్ను; అమృతం = మృతి లేని వానినిగా;

కృధి = చేయుము; ఇంద్రాయ = ఇంద్రుని కొరకు; ఇందో = ఓ చంద్రుడా! పరిస్రవ = వర్షింపుము.

తాత్పర్యము : పుణ్యవంతములైన సత్కర్మ లాచరించిన దేవతలచేత ఏ పరమపదము భూమిగా స్వీకరింపబడి నివసింపబడు చున్నదో అట్టి విష్ణులోకమునందు నన్ను శాశ్వతునిగా జేయుము. ఓ చంద్రుడా! ఇంద్రుని కొరకు బహులోకములలో వర్షింపుము.

వివరణము : ఈ ఋక్కులకు దేవతలు చంద్రుడు, ఇంద్రుడు, విష్ణువు. అందు చంద్రుడు మనస్సుల కధిపతియై తిథులలో కళలు (moods) కలుగ జేయుచుండును ఇంద్రుడు ఇంద్రియముల కధిపతి యైన మనస్సుగా సంకల్ప శక్తి నిచ్చి బృహస్పతి యనబడు వాగ్దేవత చేత శబ్ద బ్రహ్మము మంత్రముగా నుపదేశము చేయుచుండును. బృహస్పతి గురువుగా పనిచేయుచుండును. దానితో విష్ణుని అంతర్యామి లోకము ఉపాసింపబడి దర్శన మిచ్చును. మానవు లీ మార్గము నుపాసించి తదర్పణ ముగా యజ్ఞార్థ కర్మ లాచరించి, దేవతలతో సృష్టికర్మయందు సహక రించు చున్నారు. దీనిని గూర్చియే "దేవతలను గౌరవించుచున్న మానవులను దేవతలు గౌరవించు చున్నారు" అని కృష్ణుడు భగవద్గీతలో చెప్పెను. దీనినే 'దివ్యకర్మ' (Theocracy) అని పైథాగొరస్ ఉపదే శించెను. ఇది శాస్త్రములకు శాస్త్రము. దీని నభ్యాసము చేయుటకే వేదోక్తములైన క్రతువులు (Rituals) ఏర్పడినవి. దీని వలన మానవుని కోశము లన్నియు పవిత్రములై దుష్కర్మ నశించి సత్కర్మలు తన పుణ్య లోకముల కొరకు గాక విష్ణునకు సమర్పణముగా నాచరింప బడును. దేవతలు ఈ విధముగనే సృష్టి కర్మ నాచరించుచున్నారు. వారును పూర్వ మొకప్పుడు ఖనిజ వృక్ష జంతు మానవ జన్మలు ధరించి సృష్టి పరిణామ క్రమ శిక్షణమును పొంది తరించి మోక్షమును

కూడ సన్యసించి అటుపైన దేవతలై ఇప్పుడు పరమపద మనుభవించుచు సృష్టి కర్మలో పాల్గొనుచున్నారు. ఈ మార్గము నవలంబించి జీవితము నిర్వహించు కొనిన మానవుడు కూడ తరించి దేవతలలో జేరును.

మన దేహము నందు చంద్రుడు మస్తిష్కము నందలి మృదు పదార్థమునకును, ఇంద్రుడు ఇంద్రి గ్రంథి (Penial Gland) కిని. బృహస్పతి మస్తిష్కములోని మేదస్సు అనబడు చమురు పదార్థమునకును (Cerebro Spinal Fluid) అధిదేవతలు.

యత్ర తత్ పరమాప్యం
భూతానా మధి పతిమ్ ।
భావ భావీచ యోగీశ్చ
తత్ర మామమృతం కృధి ॥
ఇంద్రాయేందో పరిస్రవ ॥ 2

టీక : యత్ర = ఎచ్చట; పరం + ఆప్యం = పొందదగిన పరమ పదము గలదో (జలములచే పొందబడుచు జీవాత్మగా నటించుచున్న పరమాత్మ కలడో); భూతానాం = జీవులకు; అధిపతిమ్ = ప్రభువైన వానిని; భావభావీచ = భావమున భావించుట గల; యోగీః + చ = ఇద్దరు యోగులు (నరనారాయణు లనబడు ఇంద్రా విష్ణువులు) కలరో; తత్ర = అక్కడ; మామ్ = నన్ను; అమృతం = శాశ్వతునిగా; కృధి = చేయుము; ఇందో = ఓ చంద్రుడా! ఇంద్రాయ = ఇంద్రుని కొరకు; పరిస్రవ = వర్షింపుము.

తాత్పర్యము : ఎచ్చట పొందదగిన పరమపదము కలదో, ఎక్కడ జలముల అయన మార్గమున దిగివచ్చు నరనారాయణులు కలరో,

ఎచ్చట ఈశ్వర శబ్ద వాచ్యుడై హృదయమున విష్ణువుండి, తనను ధ్యానించు వారిని యోగులుగా చేయుచున్నాడో అచ్చట నన్ను శాశ్వతునిగా జేయుము.

యత్ర లోకా స్తనూత్యజః
శ్రద్ధయా తపసా జితాః ।
తేజశ్చ యత్ర బ్రహ్మచ
తత్ర మామమృతం కృధి ॥

ఇంద్రాయేందో పరిస్రవ ॥ 3

టీక : యత్ర = ఎచ్చట; తనూత్యజః = దేహమును విడుచునవి; లోకాః = లోకములు; శ్రద్ధయా = శ్రద్ధచేత; తపసా = తపస్సు చేత; జితాః = జయింపబడినవో; తేజస్ + చ = తేజస్సు; బ్రహ్మ + చ = బ్రహ్మయును; తత్ర = అచ్చట; మాం = నన్ను; అమృతం = అమృతునిగా; కృధి = చేయుము.

తాత్పర్యము : దేహము విడుచునట్టి మర్త్య లోకములు ఎచ్చట శ్రద్ధ చేతను, తపస్సు చేతను జయింపబడు చున్నవో; ఎచ్చట సృష్టి కర్త సత్య తేజస్సుగా విష్ణుని అంతర్యామిత్వమును ప్రతిపాదించునో అచ్చట నన్ను శాశ్వతుని చేయుము.

యత్ర దేవా మహాత్మానః
సేంద్రాశ్చ సముద్గణాః ।
బ్రహ్మచ యత్ర విష్ణుశ్చ

తత్ర మామభయం కృధి ॥
ఇంద్రాయేందో పరిస్రవ ॥ 4

టీక : యత్ర + ఎక్కడ; దేవాః = దేవతలు; మహాత్మానః = మహాత్ములు; స + ఇంద్రాః + చ = ఇంద్రునితో కూడిన వారును; స + మరుత్ + గణాః = మరుత్తు లనబడు దేవగణములతో కూడిన వారును; బ్రహ్మచ = బ్రహ్మయును; విష్ణుః + చ = విష్ణువును; తత్ర = అక్కడ; మాం = నన్ను; అభయం = భయము లేని వానినిగా; కృధి = చేయుము.

తాత్పర్యము : ఇంద్రాదులతోను, మరుద్గణములతోను కూడిన మహాత్ములగు దేవత లెచ్చట నుందురో, ఎచ్చట బ్రహ్మయు విష్ణువు నుందురో అచ్చట నన్ను నిర్భీతి గల వానినిగా చేయుము.

వివరణము : ఇచ్చట మరుత్తులతో కూడిన దేవ గణములు, ఇంద్రునితో కూడినవారు, బ్రహ్మతో కూడినవారు, విష్ణువుతో కూడిన వారు, వేరు వేరు గణములుగా చెప్పబడిరి. అందు మరుత్తులను వారు ఏడు వ్యూహములుగా పనిచేయుచు భూమి చుట్టును గల సప్త మారుత మండలమును సృష్టించు చుందురు. వారు సూర్యుని చుట్టును సృష్టి యారంభమున పని చేయుచుందురు. ఒక్కొక్క సూర్యుడు పుట్టుటకు ముందుగా ఆ తావున చీకటిలో వారు గానము చేయుదురు. తత్ఫలితముగా కొన్నికోట్ల సంవత్సరముల పరిమాణము గల కాలములో సూర్య మండలము సాలెగూడువలె అల్లుకొనును.

ఇంద్రునితో కూడియున్న దేవ గణములు భూమి చుట్టును, మేఘములను పుట్టించి విద్యుచ్ఛక్తిని వ్యక్తము చేసి ఉరుములను మెరపులను

పిడుగులను కల్పింతురు. తత్ఫలితముగా భూమి గర్భవతియై బీజాంకుర శక్తిని ధరించును. జీవులలో వారు ఇంద్రియముల కధిపతులై పనిచేయు చుందురు. వీరందరును భూలోకము నుండి బ్రహ్మలోకము దాక సూక్ష్మ సూక్ష్మముగా లోకము లల్లుకొని యుందురు. బ్రహ్మలోకమునకు పైన మహాత్ములైన దేవతలు విష్ణు జగత్తునందు వర్తింతురు. అది అంతర్యామి లోకము గనుక అందు జరామరణాది భయము లుండవు. నరలోక వాసులు విష్ణూపాసనము వలన ఈ లోకమును బొంది జీవించు చుందురు.

యత్ర గంగాచ యమునా చ
యత్రప్రాచీ సరస్వతీ ।
యత్ర సోమేశ్వరో దేవ
స్తత్ర మా మమృతం కృధి ॥
ఇంద్రాయేందో పరిస్రవ ॥ 5

టీక : యత్ర = ఎక్కడ; గంగాచ = గంగయు; యమునాచ = యమునయు; ప్రాచీ = తూర్పు దిక్కున గల; సరస్వతి = సరస్వతీ నదియు; సోమేశ్వరః = చంద్ర శేఖరుడగు; దేవః = దేవుడు; తత్ర = అక్కడ; మాం = నన్ను; అమృతం = శాశ్వతునిగా; కృధి = చేయుము;

తాత్పర్యము : ఎచ్చట గంగా యమునలును, తూర్పు దిక్కుగా సరస్వతియు ప్రవహించు చుండునో, ఎచ్చట దేవుడగు సోమేశ్వరుడు గలడో ఆ లోకమున నన్ను శాశ్వతునిగా నిల్పుము.

వివరణము : ఈ నదులు భూగోళముపై నున్నవి కావు. సూర్యుని నుండి దిగివచ్చిన ప్రాణమయ తేజస్సును యమున యందురు. కనుకనే పురాణములలో యమున సూర్య పుత్రియని వర్ణింప బడినది. చంద్రుని నుండి దిగివచ్చు పిండోత్పత్తి కరమైన తేజస్సును గంగ యందురు. ఆకాశమున అంతర్లీనముగా నుండి సృష్టిలోనికి ప్రాణముగా దిగివచ్చు తేజస్సును సరస్వతి యందురు. అది శ్వాస శక్తికిని శబ్దము నకు ఉచ్చారణమునకు కారణమగు శక్తి. కనుకనే దానిని వాగ్దేవత యందురు. ఇది అవ్యక్తముగా చోటులో నిమిడి యుండును. కనుక అంతర్వాహిని యందురు.

సోమేశ్వరుడు అనగా సోముడను గంధర్వుని రూపమున నున్న ఈశ్వరుడు. ఇతడు కాలమును శ్వాసలుగను, హృదయ స్పందనములు గను జీవులకు విభజించి ఇచ్చుచుండును. ఇతడే ఇంద్రుడుగా కూడ వ్యక్తమగును. మానవుల శిరస్సున ఇంద్ర గ్రంథి నధిష్ఠించి యుండును. ఇతడు తాళలయాత్మకమైన సంగీత విద్య కధిపతి. అనగా సామవేదమున కధిపతి. ఇతడు ప్రకృతి పురుషుల సమ్మేళనముగా అర్ధనారీశ్వర తత్త్వము కలిగి యుండును. సోమేశ్వరుడను పదమునకు స + ఉమా + ఈశ్వరుడు (ఉమతో కూడిన ప్రభువు.) అని అర్థము.

యత్ర తద్విష్ణుర్మ హీయతే
నారాయణ మధిపతిమ్ ।
యత్ర శంఖచక్ర గదా
ధర స్మరణం ముక్తిశ్చ
తత్ర మా మమృతం కృధి ॥
ఇంద్రాయేంద్రో పరిస్రవ ॥6

టీక : యత్ర = ఎచ్చట; విష్ణుః = విష్ణువు: అధిపతిం = అధిపతియగు; నారాయణం = నారాయణుని; మహీయతే = విస్తృతి చేయుచున్నాడో; శంఖ చక్ర గదాధర = శంఖము చక్రము గద ధరించిన వాడు; స్మరణం = స్మరించుటయు; ముక్తిః + చ = ముక్తియును కలదో; తత్రి = అచ్చట; మాం = నన్ను; అమృతం = శాశ్వతునిగా; కృధి = చేయుము.

తాత్పర్యము : ఎచ్చట నారాయణుడను అధిపతిని విష్ణువు అంతర్యామిగా విస్తరించు చున్నాడో, ఎచ్చట శంఖము చక్రము గద ధరించిన వాని ధ్యానము, మోక్షము సిద్ధించునో. అచ్చట నన్ను శాశ్వతునిగా నిలుపుము.

ఓమ్ తత్ సత్.





## కులపతి ఎక్కిరాల కృష్ణమాచార్య

నవయుగమున నరజాతికి సన్మార్గమును, సేవా కార్యక్రమముల రూపమున క్రమశిక్షణమును మాస్టర్ ఇ. కె. బోధించిరి. నిస్వార్థ బుద్ధితో, విశ్వప్రేమతో నడచి, కొన్ని వేలమందిని నడిపించిరి. ఆత్మ జ్ఞానమును ప్రసాదించి అనుయాయులను కార్యోన్ముఖులుగా తయారు చేసిరి. మానవజాతి కళ్యాణార్థమై వేదవిద్య, యోగవిద్యలతోపాటు వైద్య విద్యనుకూడ పంచిపెట్టిరి. మానవ ధర్మమును ప్రబోధించిరి. దేశవిదేశా లలో వైద్యసేవను ఉచితముగా చేసి, శారీరక, మానసిక ఆరోగ్యము లను కొన్ని వేలమందికి ప్రసాదించిరి. అనేక ప్రాంతములు పర్యటించి, ఆధ్యాత్మిక తత్వశాస్త్రముతో పాటు, హోమియో వైద్యవిజ్ఞానమును జిజ్ఞాసువులకు ఉపదేశించిరి. ప్రాక్‌పశ్చిమ ఆధ్యాత్మిక సమన్వయమును సాధించుటకై 'ది వరల్డ్ టీచర్ ట్రస్ట్' (జగద్గురు పీఠం) ను 1971 లో స్థాపించిరి. ఏడు పర్యాయములు పశ్చిమ ఖండములలో ఆధ్యాత్మిక ఉద్దీపనయాత్రి చేసిరి. మాస్టర్ ఇ. కె. తేది 11-8-1926 న భౌతిక దేహ మును ధరించి, తేది 17-3-1984 న ఆ దేహమును త్యజించిరి.